

పెందుర్తి కమ్యూనిటీ డెవలప్‌మెంటు బ్లాకులోని మాదురవాడ సందర్శించినప్పుడు
పరదేశిపాలెంలో ఆంధ్రప్రదేశ్ గవర్నరు టెంకాయనీరు సేవించుట



# ఆంధ్రప్రదేశ్

సంపుటి 1 జనవరి 1957 సంచిక 2

## విషయసూచిక



— చందా —

సాలుసరి రు. 2—0—0 విడిప్రతి 0—2—0

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే *ప్రచురింపబడి* అజంతా ప్రింటర్సులో *ముద్రింపబడినది.*

# ఆంధ్ర విశ్వవిద్యాలయం

## 30 ఏండ్ల అభివృద్ధి ఫలితంగా భారతదేశంలో పేరెన్నికగన్న విద్యాపీఠం

**దేశంలోని ప్రముఖ విద్యావేత్తల మార్గదర్శకత్వంక్రింద ముప్పయి ఏండ్లు అచంచలంగా నిల్చి క్రమేపీ అభివృద్ధిచెందిన కారణంగా ఈనాడు ఆంధ్ర విశ్వవిద్యాలయం దేశంలోని గొప్ప విద్యాకేంద్రాలలో ఒకటిగా అలరారుతున్నది.**

ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉన్నతమయిన ఆశయాలతో 1926 లో స్థాపించబడింది. అప్పటినుంచి ఈ ముప్పయి ఏండ్లు నిర్విరామంగా కృషిజరిగి ఎన్నో అవరోధాలను ఎదుర్కొని ముందుకు సాగిపోబట్టే ఈనాడు ఈ విశ్వవిద్యాలయం ఇట్టిస్థితికి రాగలిగింది. దీని వ్యవస్థాపకులు, దీనిపై ఆదరాభిమానాలు కలవారు దీని స్వరూపం ఏ విధంగా ఉండవలెనని కలలుగన్నారో అది అంతా వారు కాంక్షించినంత త్వరలో సాధించబడకపోవచ్చు. అయినప్పటికీ ఈ విశ్వవిద్యాలయంలోని శిక్షణ సాంప్రదాయాలు, వైజ్ఞానికంగా ఇది పొందిన అభివృద్ధి దేశంలోని అత్యున్నతప్రమాణాలతో సరితూగగలవని విజ్ఞులు పరిగణించిపున్నారు.

"విశ్వవిద్యాలయానికి చెందినవ్యక్తి తాను తనదేశ సంస్కృతికి ప్రతినిధినని భావించాలి. సమగ్రమైన తాత్విక దృష్టిలోనేమి, అత్యున్నతమైన నైతిక విలువలకేమి మన సంస్కృతి మరే ఇతరదేశ సంస్కృతికి తీసిపోదు" అంటూ విశ్వవిద్యాలయ గ్రాంట్ల కమీషన్ అధ్యక్షుడు శ్రీ సి. డి. దేశముఖ్ 1956 డిసెంబరు 8 వ తేదీన ఆంధ్ర విశ్వవిద్యాలయములో స్నాతకోపన్యాసమిస్తూ ప్రబోధంచేశారు.

భారతదేశ సంస్కృతికి ప్రతినిధులని చెప్పదగినట్టి మేధావంతులు ఈ విశ్వవిద్యాలయానికి మార్గదర్శకులుగా లభించడము దీని మహాభాగ్యమని చెప్పాలి. ఎన్నో గొప్ప వ్యక్తిత్వాలు ఈ విశ్వవిద్యాలయంలో రూపొందినవి.

దీని ప్రధాన నిర్మాతలలో కీ. శే. కట్టమంచి రామలింగారెడ్డి ఒకరు. అత్యంత శ్రద్ధాసక్తులతో, స్వార్థరహితమయిన దీక్షతో ఆయన ఈ విశ్వవిద్యాలయం అభివృద్ధికి పునాదులు వేసి, పురోగమన మార్గాలను నిర్ణయించి సోయగమూ స్థిరత్వమూగల ఒక స్వరూపాన్ని దీనికిచ్చాడు. దీనికి విరాళాలను గ్రాంట్లను సంపాదించి ఎంతో శ్రద్ధతో దీనిశిఖరాలను నిర్మించాడు. యూరపు, అమెరికా, దూర ప్రాచ్యదేశాల విద్యా విధానాలను బాగా ఆకళింపు చేసుకొని బరోడా, మైసూరు సంస్థానాలలో పరిపాలనానుభవము గడించిన ఈయన 1926 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం మొట్టమొదటి ఉపాధ్యక్షుడుగా ఎన్నికచేయబడినాడు. అప్పుడు మద్రాసు గవర్నరుగావున్న లార్డు గోశ్చెన్ ఈ విశ్వవిద్యాలయానికి అధ్యక్షుడు. బొబ్బిలి రాజా ప్రో ఛాన్సలర్‌గావున్నాడు. రెండేడ్ల తరువాత సెనేట్ బడ్జెట్ సమావేశంలో శ్రీ రామలింగారెడ్డిగారు ఏకగ్రీవంగా ఎన్నికై ఆ పదవిలో 1930 వరకు ఉన్నారు. మధ్య ఆరేండ్ల వ్యవధి తరువాత తిరిగి ఆయన ఆ పదవిలోచేరి 1949 వరకు విశ్వవిద్యాలయానికి సేవచేశారు.

ప్రస్తుతం భారత ఉపాధ్యక్షులుగావున్న డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు 1931 నుంచి 1936 వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగావున్నారు. ఈ పదవి నలంకరించిన వారిలో డాక్టర్ టి. యస్. తిరుమూర్తి, సర్ జె. సి. కోయాజీ, శ్రీ ఓ. పుల్లారెడ్డి, శ్రీ లక్కరాజు సుబ్బారావు గారలుకూడా కలరు. ఇప్పుడు డా. వి. యస్. కృష్ణ ఉపాధ్యక్షులుగా వున్నారు.

### ప్రారంభం

ఆంధ్రప్రాంతానికి ఒక విశ్వవిద్యాలయం వుండవలెననే భావం 1920 అక్టోబరులో కలిగింది. ఆ సంవత్సరమే



స్నాతకోత్సవం : యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ అధ్యక్షులు శ్రీ సి. డి. దేశ్‌ముఖ్ 1950 డిసెంబరు 8 వ తేదీన ఆంధ్ర విశ్వవిద్యాలయంలో స్నాతకోపన్యాసమిస్తున్న దృశ్యం.

ంద్రాసు విశ్వవిద్యాలయం సెనేట్ ప్రతిభాషా ప్రాంతానికి సీసం ఒక విశ్వవిద్యాలయం వుండవలసిన ఆవశ్యకత ంతైనా కలదనీ, ఆంధ్రప్రాంతానికి త్వరలో ఒక విశ్వ ద్యాలయము నెలకొల్పవలెననీ తీర్మానించింది. ఆమరుసటి ంవత్సరం రాష్ట్ర ప్రభుత్వం ఒక కమిటీని వేసింది. ఆ మిటీవారు తెలుగుప్రాంతంలో ఒక బోధనా విశ్వవిద్యా యాన్ని నెలకొల్పవలెనని సిఫారసు చేశారు. అయితే లకాలంవరకు ఈ విషయంలో ఏమీజరగలేదు. మిస్టర్ ర్. యం. స్టాథాం ప్రభుత్వానికి దాఖలు చేసిన మరొక వేదికలో ఆంధ్ర విశ్వవిద్యాలయం స్థాపించబడవలసిన వశ్యకతను సహేతుకంగా నిరూపించాడు. అతడే ఒక థకం తయారు చేశాడు.

సర్ ఎ. పి. పాత్రో మద్రాసు ఎగువ శాసన సభలో క బిల్లు ప్రవేశపెట్టాడు. 1926 జనవరి 26 తేదీన ఆంధ్ర శ్వవిద్యాలయ చట్టం గెజిట్‌లో ప్రకటింపబడింది. అది 1926 ఏప్రిల్ 26 తేదీ నుంచి 12 జిల్లాలలో అమలులోకి వచ్చింది. ఎన్నికైన మొట్టమొదటి సెనేటుకు 1926 ఆగస్టు 30 తేదీన ప్రారంభోత్సవం జరిగింది. ఆ తరువాత అకడ మిక్ కౌన్సిలు, తదితర సంస్థలు ఏర్పడ్డవి.

రాజమండ్రిలోని టీచర్సు ట్రెయినింగ్ కాలేజి, విశాఖ పట్నంలోని వైద్యకళాశాల గాక మరి 12 కళాశాలలు ఆంధ్ర విశ్వవిద్యాలయం క్రిందికి వచ్చినవి. మొట్టమొదటి స్నాతకోత్సవం 1927 డిసెంబరు 5 వ తేదీన జరిగింది. డా. యస్. రాధాకృష్ణన్ స్నాతకోపన్యాస మిచ్చారు. అందులో 203 మంది అభ్యర్థులు బి. ఏ. డిగ్రీని, 37 మంది బి. ఇడి. డిగ్రీని, 11 మంది ప్రాచ్య భాషా పట్టాలు పుచ్చుకున్నారు.

విశాఖపట్నంలో ఈ విశ్వవిద్యాలయమును నెలకొల్ప వలెనని ఎగువ శాసనసభ తీర్మానించింది. 1930 సెప్టెంబరు 5 వతేదీనుంచివాల్తేరు అప్‌లాండ్సులో "హోటల్ సెసిల్"

అనే భవనమును తీసుకొని అందులో విశ్వవిద్యాలయాన్ని పెట్టడం జరిగింది. అదే దీనికి మొట్టమొదటి నిలయం.

అదే సంవత్సరం శాసనసభ చేసిన మరొక చట్టాన్ని అనుసరించి ప్రభుత్వం ఈ విశ్వవిద్యాలయానికి ఫౌండేషన్ ఫండ్ కొరకు అనావృత్త గ్రాంటుగా రూ. 27 లక్షలు, భవన నిర్మాణం, యంత్ర పరికరాలకొరకు అనావృత్త వ్యయంగా రూ.7½ లక్షలు విశ్వవిద్యాలయ సాధారణ ఖర్చు నిమిత్తమై వార్షిక గ్రాంటుగా రూ. 1½ లక్ష చెల్లించవలెనని నిర్ణయింపబడింది. ఆ చట్టంద్వారా ఒక గ్రంథాలయ సంఘం కూడా నిర్మింపబడింది. ఆ సంఘానికి విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడే ఎక్సు అఫిషియో సభ్యుడుగా, సంఘ అధ్యక్షుడుగా వ్యవహరిస్తారు.

1931 లో డాక్టర్ రాధాకృష్ణన్ ఉపాధ్యక్షు లయ్యారు. అప్పుడే ఆర్ట్సు కళాశాల ఆరుగురు అధ్యాపకులతో ప్రారంభింపబడింది. 1932 జులై 4 వ తేదీన పదార్థ విజ్ఞానశాస్త్రం, రసాయన శాస్త్రములలో ఆనర్సు కోర్సుతో యూనివర్సిటీ సైన్సు, టెక్నాలజీ కాలేజీ ప్రారంభింపబడింది. 1933-34 వరకల్లా ఆర్ట్సు సైన్సు టెక్నాలజీ కళాశాలలకు, హాస్టల్ క్లాసులకు మొదలైనవాటికి భవనములు నిర్మింపబడ్డవి. ఈ భవనములకే బ్లాకు గ్రాంటు మొత్తం 7½ లక్షల రూ. లు ఖర్చు అయిపోయినవి.

జయపూరు రాజా విక్రమదేవవర్మగారు 1933-34 లో విశ్వవిద్యాలయానికి రూ.50,000 లు తర్వాత, రూ.75,000 లు ఆతరువాత ప్రతిసంవత్సరం ఒక లక్ష రూపాయల చొప్పున వారుగాని లేక వారి వారసులుగాని మొత్తం 15 లక్షల రూపాయిలు చెల్లించునంతవరకు విరాళాలు ఇస్తూఉంటామని కూడా వాగ్దానం చేశారు. అందుచేత సైన్సు, టెక్నాలజీ కాలేజీకి జయపూరు విక్రమదేవ కాలేజి అఫ్ సైన్సు అండ్ టెక్నాలజీ అని నామకరణం చేయబడింది.

1942 లో విశ్వవిద్యాలయంలో సైన్సు, ఆర్ట్సు ప్యాసు కోర్సులు విరమింపబడినవి. ఇందువల్ల 'విశ్వవిద్యాలయ కళాశాల అడ్వాన్స్‌డ్ టీచింగ్, పరిశోధనలపై పూర్తిగా



*ఆంధ్ర విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో పట్టభద్రులకు పట్ట ప్రదానంచేస్తున్న*
*ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ చందూలాల్ త్రివేది*



అమెరికా ప్రొఫెసరుకు గౌరవ బహూకరణ:
*ఆంధ్ర విశ్వవిద్యాలయ 30 వ స్నాతకోత్సవంలో విశ్వవిద్యాలయమునకు ఆనరరీ విజిటింగ్ ప్రొఫెసర్, కాలిఫోర్నియాలోని యు. యస్. నేవీ ఎలక్ట్రానిక్సుయొక్క ఓషియానో గ్రాఫీ బ్రాంచి అధిపతి అయిన ప్రొఫెసర్ యూజీన్ సెసిల్ లాఫాండ్ విజ్ఞానశాస్త్రంలో గౌరవ డాక్టొరేటు పట్టమును స్వీకరిస్తున్న దృశ్యం.*

దృష్టిని కేంద్రీకరించడానికి అవకాశం కలిగింది. 1934-35 సంవత్సరంవరకల్లా విశ్వవిద్యాలయ గ్రంథాలయానికి దాదాపు 23,000 గ్రంథములు లభ్యమైనవి. లక్ష రూ. ల వ్యయంతో గ్రంథాలయానికి విశాలమైన భవనం నిర్మింపబడింది.

## ఐదేండ్ల కార్యక్రమం

విశ్వవిద్యాలయ అభివృద్ధికొరకై డా. సి. ఆర్. రెడ్డి అయిదేండ్ల కార్యక్రమం తయారుచేయగా దానిని పూర్తిగా స్పెషల్ సిండికేట్ కమిటీ ఆమోదించింది. అప్పుడు విశ్వవిద్యాలయం అనావృత్త గ్రాంటుగా రూ. 12 లక్షలు, ఆవృత్త గ్రాంటుగా రూ. 2 లక్షలు ఇవ్వవలసిందిగా ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టుకుంది. అంతేగాక విశ్వవిద్యాలయ అవసరాలకు అనుకొనివున్న ప్రభుత్వ అడవితోటను ఉచితంగా ఇవ్వవలసిందిగా కోరింది. 1938 మేలో ఆ అడవి భూమిలో 34 ఎకరాల భూమిని విశ్వవిద్యాలయ భవనముల కొరకు కేటాయించడానికి ప్రభుత్వం అంగీకరించింది. 1937-38 లో కొత్త హాస్టల్ బ్లాకు, టెక్నాలజీ వర్కుషాపు, యూనివర్సిటీ కాలేజీ టీచర్లకు ఫాకల్టీ క్లబ్బును నిర్మించడానికి మంజూరీ లభించింది. హాస్టలుకు అనుబంధంగా ఒక వైద్యశాల తెరువబడింది. అందులో రోగులు ఉండడానికి అవకాశమున్నది. విద్యార్థులకొరకు తాత్కాలికంగా మరొక హాస్టలు ప్రారంభింపబడింది. దాని నిర్వహణకయ్యే ఖర్చు వైస్ ఛాన్సలర్ ఫండ్‌నుంచి భరించబడింది.

1937-38 లో విశ్వవిద్యాలయానికి మరికొన్ని గ్రాంట్లు లభించినవి. వాటిలో హైదరాబాదు నిజాముగారు ఇచ్చిన లక్ష రూపాయిలు, తిరువాన్కూరు మహారాణి సేతుపార్వతీబాయిగారిచ్చిన లక్ష రూపాయిలు ముఖ్యంగా పేర్కొనదగినవి.

1941 జూలై నుంచి ఎర్స్కిన్ కాలేజీ ఆఫ్ నాచురల్ సైన్సు వ్యవస్థీకరింపబడింది. దీనికి ప్రభుత్వం రూ. $3\frac{1}{2}$ లక్షల అనావృత్త గ్రాంటు, రూ. 39,600 ల ఆవృత్త గ్రాంటు మంజూరు చేసింది.

## గుంటూరుకు మార్పు

1942 ఏప్రిల్ 6 వ తేదీన విశాఖపట్నం, కాకినాడలపై జపాను విమానదాడుల కారణంగా మిలిటరీవారు విశ్వవిద్యాలయ భవనములను స్వాధీనపరచుకోడానికి నిర్ణయించారు. అందువల్ల విశ్వవిద్యాలయం మరొకచోటికి తరలిపోవలసి వచ్చింది. కనుక విశ్వవిద్యాలయ కళాశాలలు మూడు, విశ్వవిద్యాలయ కార్యాలయములు మూడు వాల్తేరులో ఏప్రిల్ 16 వ తేదీన మూసివేయబడి తిరిగి ఏప్రిల్ 24 వ తేదీన గుంటూరులో ప్రారంభింపబడినవి. రసాయనశాస్త్రశాఖ మద్రాసులో పనిచేయనారంభించింది. గుంటూరుకు జరిగిన ఈ మార్పును క్రమబద్ధం చేయడానికై మద్రాసు గవర్నరు ఆంధ్ర విశ్వవిద్యాలయ చట్టమును (1942 లో 19 వ సంఖ్య గలది) చేస్తూ యుద్ధం ముగిసేవరకూ ఆ తరువాత రెండేండ్ల పాటువరకు విశ్వ విద్యాలయ కేంద్రమునకు సంబంధించిన సెక్షనులను తాత్కాలికంగా నిలుపుదలచేశారు.

ఉత్సవ రంగం (కాన్వొకేషన్ హాల్) ఖర్చునిమిత్తమై మద్రాసు ప్రభుత్వం రూ. $2\frac{1}{4}$ లక్షలు, హైదరాబాదు నిజాం గారు రూ. 2 లక్షలు మంజూరుచేశారు.

1946 లో విశ్వవిద్యాలయ కార్యాలయాలు మొదలయినవి తిరిగి వాల్తేరుకు మార్చబడినవి.

## రజతోత్సవం

విశ్వ విద్యాలయ రజతోత్సవ నిధికొరకై మద్రాసు ప్రభుత్వము రూ. 6 లక్షలు, యూనియన్ ప్రభుత్వము రూ. 3 లక్షలు మంజూరుచేశాయి.

విశ్వవిద్యాలయ చరిత్ర విభాగంలో బిర్లా ధర్మ నిధివారు ఒక ప్రొఫెషనల్ చేర్ నెలకొల్పారు.



*ఆంధ్ర విశ్వవిద్యాలయ యన్. సి. సి. కేడెట్ల దళం సమర్పించిన గౌరవ వందనాన్ని గవర్నరు తనిఖీ చేస్తున్నారు.*



శ్రీ జయపూరు విక్రమదేవ్ సైన్సు అండ్ టెక్నాలజీ కాలేజి.

1953 జనవరి 5 తేదీన ఆంధ్ర విశ్వవిద్యాలయం రజతోత్సవం జరుపుకుంది. భారత ఉపరాష్ట్రపతి, ఒకప్పుడు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులయిన డా. యస్. రాధాకృష్ణన్ అధ్యక్షత వహించారు. భారత రిపబ్లిక్ అధ్యక్షులు డాక్టరు రాజేంద్రప్రసాద్ ఫిబ్రవరి 16 తేదీన విశ్వవిద్యాలయాన్ని సందర్శించారు. అంతకుపూర్వం వారు జాతీయ కాంగ్రెసు మహాసభ అధ్యక్షులుగా ఉండగా ఒకమారు విశ్వవిద్యాలయాన్ని చూచివున్నారు. రజతోత్సవ సందర్భంలో విశ్వవిద్యాలయ మాజీ ఛాన్సలర్ అగు భావనగర్ మహారాజా కమ్మొడోర్ రావు శ్రీ సర్ కృష్ణకుమార్ సింహజీ భావ సింహజీ, హైదరాబాదు రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ బి. రామ కృష్ణారావు, మద్రాసు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నార్, శ్రీ లక్కరాజు సుబ్బారావు, పిఠాపురం మహారాజా శ్రీ రాజారావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహదూర్, పుయ్యూరు జమీందారు శ్రీ రాజా యం. వెంకటాద్రి అప్పారావు బహదూర్, మునగాల రాజా శ్రీ యస్. వి. రంగారావు బహదూర్ గారలకు గౌ. పట్టములివ్వబడినవి.

ఈ విశ్వవిద్యాలయం కోరికపై అంతర్విశ్వ విద్యాలయ బోర్డుయొక్క 28వ వార్షిక సమావేశం రజతోత్సవ సందర్భములోనే విశ్వవిద్యాలయ భవనాలలో జరిగింది. ఆ సందర్భములోనే సెకండరీ ఎజుకేషన్ కమీషనువారుకూడా వాల్తేరు విచ్చేశారు.

1952-53 అకడమిక్ సంవత్సరంనుంచి యూనివర్సిటీ కాలేజీలలో ఈ దిగువ క్రొత్తకోర్సులు ప్రవేశపెట్టబడినవి. (1) అప్లయిడ్ జువాలజీలో యం. యస్. డిగ్రీ (అప్లయిడ్ జువాలజీ కోర్సులో పోస్టు గ్రాజువేట్ డిగ్రీకోర్సును ప్రవేశపెట్టడంలో భారతదేశ విశ్వవిద్యాలయాలలో ఇదే ప్రథమపర్యాయం); (2) కెమికల్ టెక్నాలజీలో బి. యస్. సి. ఆనర్సు డిగ్రీ పరీక్షకు ప్రత్యేక సబ్జక్టుగా ఎలక్ట్రో కెమికల్ టెక్నాలజీ.

ప్రస్తుతమున్న నాలుగు సెకండ్‌గ్రేడ్ కాలేజీలకు డిగ్రీ కోర్సులకు, రెండు క్రొత్తకాలేజీలకు ఇంటర్మీడియేట్ కోర్సులకు విశ్వవిద్యాలయంతో అనుబంధంకొరకై మంజూరీ ఇవ్వబడింది. దీనితో 1953-54 అకడమిక్ సంవత్సరము నుంచి ఫస్టుగ్రేడ్ కాలేజీలసంఖ్య 14 నుంచి 18 వరకు, సెకండ్‌గ్రేడ్ కాలేజీలసంఖ్య 7 నుంచి 9 వరకు హెచ్చింది. ఈ విశ్వవిద్యాలయ యం. డి. మరియు యం. యస్. డిగ్రీ పరీక్షలకు కూర్చొనే అభ్యర్థుల సౌకర్యం నిమిత్తమై విశాఖపట్నం కె. జి. హాస్పిటల్ ఆంధ్ర మెడికల్ కాలేజీలో పోస్టు



వివేక్ విన్యాస హాస్టల్



వాల్తేరులోని ఆంధ్ర విశ్వవిద్యాలయ భవనముల దృశ్యం



టెక్నాలజీ లేబొరేటరీ ఎక్స్‌టెన్షన్



హర్షవర్ధన హాస్టల్



ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయ భవనం.

సద్ధర్మ సాధన హాస్టల్



ఎర్ స్కిన్ కాలేజి ఆఫ్ నాచురల్ సైన్సెస్



శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి విహారం



ఆర్ట్సు, కామర్సు కాలేజి.



అశోకవర్ధన హాస్టల్

గ్రాజుయేట్ ట్యూషన్ 1952-53 అకడమిక్ సంవత్సరం నుంచి అమలులోకివచ్చింది. మళ్ళీ భారత అధ్యక్షులు డా. రాజేంద్ర ప్రసాద్ 1954 మార్చి 16 వ తేదీన విశ్వ విద్యాలయాన్ని సందర్శించారు.

## షీల్డు గెలుపు

1951 వనమహోత్సవంలో చెట్లు నాటడంలో అన్ని విశ్వవిద్యాలయములలోను ఉత్తమమని అనిపించుకున్నం దునగాను ఈ విశ్వవిద్యాలయానికి భారతప్రభుత్వం మున్షీ షీల్డు బహూకరించింది.

1954-55 లో గుంటూరు మెడికల్‌కాలేజీకి క్లినికల్ యం. బి. బి. యస్. డిగ్రీ కోర్సుల విషయములో అను బంధమునకు అనుమతి ఇవ్వబడింది. ఆ తరువాత 1955-56 అకడమిక్ సంవత్సరంలో బాపట్లలోని ఆంధ్ర పశువైద్య కళాశాలకు, నెల్లూరులోని గవర్నమెంటు ట్రెయినింగుకాలేజీకి, రాజమండ్రిలోని గవర్నమెంటు ట్రెయినింగ్ కాలేజీకి విశ్వవిద్యాలయముతో అనుబంధము కొరకు అనుమతి ఇవ్వబడింది. నిడుబ్రోలులోని పి. బి. యన్. కాలేజీ (సెకండరీగ్రేడ్ కాలేజీ) ని 1955-56 అకడమిక్ సంవత్సరంనుంచి ఫస్టుగ్రేడ్ కాలేజీగా అభివృద్ధిపరచడ మయినది. అందులో బి, ఏ. డిగ్రీ కోర్సులకు అనుబంధం కొరకు అనుమతి ఇవ్వబడింది.

డాక్టరు రాజేంద్ర ప్రసాద్ మళ్ళీ 20-8-1955 తేదీన విశ్వవిద్యాలయాన్ని సందర్శించారు.

విజయవాడలోని ఆంధ్ర లయోలా కాలేజీ, అనకాపల్లి యం. ఏ. ఎల్. కాలేజీ, నర్సాపూరు కాలేజీ ఫస్టుగ్రేడు కాలేజీలుగా అభివృద్ధి పరచబడినవి. విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు డా. వి. యస్. కృష్ణ రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్‌వారి ఆహ్వానంపై అమెరికా వెళ్ళినారు. అప్లయిడ్ ఫిజిక్సు డిపార్టుమెంటుకు భవనం నిర్మింపబడింది. ఇప్పుడు ఆ డిపార్టుమెంటు ఆ భవనంలోనే వున్నది. బాలురకొరకు కొత్తగా ఒక హాస్టల్ నిర్మింపబడింది. జువాలజీ డిపార్టుమెంటుకు ప్రత్యేకంగా భవనం నిర్మించడానికై రూ. 1,97,000 లు న్యూక్లియర్ ఫిజిక్సు లేబొరేటరీ నిర్మాణం కొరకై రూ. 2,14,000 లు విశ్వవిద్యాలయ గ్రాంట్సు కమీషన్‌వారు మంజూరు చేశారు.

బాలురకొరకు అదనంగా మరిరెండు హాస్టళ్ళు, బాలికల కొరకు ఒక హాస్టలును నిర్మించడానికై విశ్వవిద్యాలయం మంజూరీయిచ్చింది. విశ్వవిద్యాలయ ఆవరణలో న్యూక్లియర్ ఫిజిక్సు లేబొరేటరీలకు శ్రీ సి. డి. దేశముఖ్ 1956 డిసెంబరు 10 వ తేదీన శంకుస్థాపన చేశారు. అంతకుపూర్వం డిసెంబరు 8 వ తేదీన ఈ విశ్వవిద్యాలయ పూర్వవిద్యార్థిని శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ విశ్వవిద్యాలయ బాలికల వసతిగృహానికి శంకుస్థాపన చేశారు.

బోధనా శాఖలు, సిబ్బంది, భవనముల విషయంలో విశ్వవిద్యాలయం దినదినాభివృద్ధి గాంచుచున్నది.

# ★ వార్తాచిత్రాలు ★



*30-11-1956 తేదీన హైద్రాబాదు రాజ్ భవన్‌లో ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గ సభ్యులుగా ప్రమాణస్వీకారం చేస్తున్న శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు*



హైద్రాబాదు నగరంలోని కేన్సర్ ఆసుపత్రిని గవర్నరు, వారిసతీమణి శ్రీమతి కుసుంత్రివేది దర్శించారు
(క్రింద) రాజ్ భవన్ లో పత్రికా విలేఖరులతో ముచ్చటిస్తున్న రాష్ట్రగవర్నరు శ్రీ చందూలాల్ త్రివేది



హైద్రాబాదు నగరంలోని రాజాబహదూర్ వెంకటరామారెడ్డి మహిళాకళాశాలలో డా. బూర్గుల రామకృష్ణారావుగారి చిత్రపటావిష్కరణ చేస్తున్న మధ్యప్రదేశ్ గవర్నరు డా. పట్టాభి సీతారామయ్యగారు

(క్రింద) హైద్రాబాదు నగరంలోని ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో బాలల దినోత్సవ సభలో ప్రసంగిస్తున్న రాష్ట్రగవర్నరు శ్రీ చందూలాల్ త్రివేది



వాణిజ్యపరిశ్రమల శాఖామంత్రి శ్రీ వి. బి. రాజు హైద్రాబాదులోని ప్రభుత్వ ముద్రణాలయంలో యంత్రములను చూస్తున్న దృశ్యం



హైద్రాబాదులోని గవర్నమెంటు కాలేజి ఆఫ్ ఆర్ట్సులో ఏర్పాటుచేయబడిన కళాప్రదర్శనానికి రాష్ట్రముఖ్యమంత్రి
శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ప్రారంభోత్సవంచేసిన సందర్భంలో తీయబడిన చిత్రం

ఉస్మానియా విశ్వవిద్యాలయం తాలూకు మహిళా కళాశాల విద్యార్థినులు 12-12-1956 తేదీన కాడేధాన్ గ్రామంలో
ఏర్పాటుచేయబడిన సాంఘిక సేవాశిబిరంలో హరిజన బాలబాలికలకు స్నానం చేయిస్తున్న దృశ్యం





హరిజనవాడలో పిల్లలకు అక్షరాభ్యాసం చేస్తున్న దృశ్యం



పిల్లలకు పాలుపడుతున్న దృశ్యం

# విజయవాడలో కొత్త ట్రాన్స్మిటరు



ఆలిండియా రేడియో అభివృద్ధి కార్యక్రమాన్ని అనుసరించి 1956 డిసెంబరు 9 వ తేదీనుంచి విజయవాడలో 20 కిలోవాట్ల మీడియం వేవ్ ట్రాన్స్మిటర్ పనిచేయ నారంభించింది. ఈ కొత్తట్రాన్స్మిటర్ గుంటూరు–బెజవాడ మీటర్ గేజ్ రైలుమార్గములో నంబూరువద్ద నెలకొల్పబడింది. దీనితో ఎంతోకాలంనుంచి అలాగేవున్న ఆంధ్రప్రాంత అవసరం తీరింది.

1948 డిసెంబరు 1 వ తేదీనుంచి విజయవాడ రేడియో స్టేషను 1 కె. డబ్ల్యు. యం. డబ్ల్యు. ట్రాన్స్మిటర్‌తో పనిచేస్తూవుంది. ఇప్పుడు దానికిబదులు హై పవర్ ట్రాన్స్మిటర్ పెట్టబడింది. ఈ ట్రాన్స్మిటర్‌కు ప్రథమ పంచవర్ష ప్రణాళికలో తగుమొత్తము కేటాయింపబడింది. ఇది 840 కెసి/యస్ ఫ్రీక్వెన్సీపై లేదా 357.1 మీటర్ల వేవ్‌లెంత్‌పై పనిచేస్తుంది.

ఈ ట్రాన్స్మిటర్ యంత్ర పరికరాలు కడు ఆధునికమైనవి. చక్కనిరీతిలో నిర్మింపబడినవి. ఒక్కొక్కటి 400 అడుగుల ఎత్తుగల రెండు సెల్ఫ్‌రేడియేటింగ్ టవర్లు సమర్థవంతముగా పనిచేస్తాయి. ఈ క్రొత్తట్రాన్స్మిటర్ నంబూరు రైలుస్టేషనుకు ఎదురుగానున్న 42 ఎకరాల స్థలంలో నెలకొల్పబడింది.

# భారత దేశంలో 2 వ పెద్దకూలింగ్ టవర్ గల రామగుండం థర్మల్ విద్యుచ్ఛక్తి కేంద్రం



పూర్వపు హైద్రాబాదు రాష్ట్రప్రాంతంలో నిర్మింపబడిన థర్మల్ విద్యుచ్ఛక్తి కేంద్రాలన్నిటిలో రామగుండం థర్మల్ విద్యుచ్ఛక్తి కేంద్రం పెద్దది. ఈ కేంద్రం ముఖ్య విశేషాలు ఇవి:

ఇది హైదరాబాదు నగరానికి ఈశాన్యదిశన 140 మైళ్ళ దూరంలో, కరీంనగర్‌కు 40 మైళ్ళ దూరాన గోదావరి నది సమీపంలోవున్నది. రామగుండంవరకు దక్కని రోడ్డు వున్నది. రామగుండం ఖాజీపేట– బల్లార్షా రైలుమార్గంపై ఒకస్టేషను. ఈ విద్యుచ్ఛక్తికేంద్రం పరిమాణం 37,500 కిలోవాట్లు. ఇది మూడు యూనిట్లుగావున్నది. ఆవిరియొక్క చలన పరిస్థితి 450 పౌనుల చదరపు అంగుళములు, 7.50 ఫారన్ హీట్ డిగ్రీలు.

ప్రధానమయిన పంప్‌హౌస్ విద్యుచ్ఛక్తికేంద్రానికి రెండు మైళ్ళ దూరంలో గోదావరినదిపై వున్నది. పంప్‌హౌస్

*రామగుండం థర్మల్ పవర్ స్టేషన్ కూలింగ్ టవర్*

నుంచి నీరు ఒక రిజర్వాయరులోకి తోడబడుతుంది. ఆ రిజర్వాయరునుంచి నీరు కండెన్సర్ సర్క్యులేషన్, బాయిలర్ ఉపయోగముల నిమిత్తం తీసుకోబడుతుంది. కండెన్సర్ సర్క్యులేటింగ్ నీటిని పారబాలిక్ రీ ఇన్‌ఫోర్డ్స్ కాంక్రీట్ కూలింగ్ టవర్‌వల్ల చల్లపరచడమవుతుంది. ఈ కూలింగ్ టవర్ ఎత్తులో భారతదేశం మొత్తంలో రెండవదని చెప్పబడుతున్నది. గోదావరినది నీటిలో ఎక్కువ శాతం లవణాలు వుంటాయికాబట్టి నీరు కండెన్సర్‌లో ప్రవేశించే ముందుగా రసాయనికంగా సనియమం చేయబడుతుంది. బాయిలర్ల నీటిని సనియమం చేయడమేగాక దాని శాశ్వత దృఢత్వమును లవణముల మితిని తగ్గించివేసి క్షారమును హెచ్చించడమవుతుంది. మేకప్‌నీటిలో 9 కంటె కొంచెం హెచ్చయిన హెచ్. పి. వాల్యు ఉంచబడుతుంది. విద్యుచ్ఛక్తి కేంద్రంలో సర్వపరికర సమన్వితమైన ప్రయోగశాలవున్నది. ఇందులో నిపుణులయిన రసాయన శాస్త్రజ్ఞులున్నారు. ఇట్టి ప్రయోగశాల ఉండడంచేత ఆవిరి నిమిత్తం బాయిలర్లలో సాధ్యమైనంత అధిక విశ్లేషణతో నీటిని వినియోగించడానికి వీలుపడుతున్నది,

## మరొక టవర్ నిర్మాణం

జనరేటర్ పరిమాణం 37,500 కిలోవాట్లు అయినప్పటికీ బాయిలర్ పరిమాణం 25,000 కిలోవాట్లుమాత్రమే. అంటే రెండుయంత్రాల పూర్తిపరిమాణము.కాని క్రాంట్రాక్టెడ్‌లోడ్ ఇప్పటికే యూనిట్ల పరిమాణాన్ని మించిపోయింది. కాబట్టి మొత్తం 37,500 కిలోవాట్లను దృఢపరిమాణంగా చేయడానికై సాధ్యమయినంత త్వరలో బాయిలర్ పరిమాణాన్ని హెచ్చించడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. మరొక కాంక్రీట్ కూలింగ్ టవర్‌కూడానిర్మింపబడుతుంది.

విద్యుచ్ఛక్తి కేంద్రంపై పెద్దలోడ్లు యీ క్రిందివిధంగా ఉన్నవి.

| | | |
|---|---|---|
| 1. కాగితం, వస్త్రము, సిమెంటు, కాలరీ పరిశ్రమలు | 21,400 | కిలోవాట్లు. |
| 2. హెడ్‌క్వార్టరు, పట్టణములు గ్రామీణ ప్రాంతాలకు విద్యుద్దీపాలు వెయ్యడం | 3,000 | ,, |
| 3. వ్యవసాయ పంపింగ్‌లోడ్ అంచనా | 2,000 | ,, |
| 4. హైద్రాబాదు నగరానికి సరఫరా | 5,000 | ,, |
| 5. స్టేషన్ ఆగ్జిలియరీస్, రామగుండం పవర్ లోడ్ | 2,500 | ,, |
| | 33,900 | కిలోవాట్లు. |

పెద్ద పరిశ్రమలకు అమలులోనున్న టారిఫ్ రేటు ప్రకారము సగటున యూనిట్ 1 కి 8 మొదలు 9 పైసలవరకు తీసుకోబడుతుంది.

# కమ్యూనిటీ రేడియో సెట్లు

## రెండవ ప్రణాళిక క్రింద తలపెట్టబడిన పథకం



గ్రామాలలో రేడియో సెట్టులను నెలకొల్పి వాటిని నిర్వహించడానికై రెండవపంచవర్ష ప్రణాళిక క్రింద ప్రభుత్వం ఒక పథకాన్ని ఆమోదించింది. ఈ పథకం రెండవ ప్రణాళిక క్రింద రాష్ట్రంలో జరుగు అభివృద్ధి కార్యక్రమాలనుగూర్చి ప్రజలకు తెలియజేయడానికి ముఖ్యంగా ఉద్దేశింపబడింది. ఈ పథకం వల్ల మారుమూలల్లోవున్న గ్రామస్తులుకూడా అభివృద్ధి పనులను తెలుసుకొని ప్రణాళిక విజయవంతము కావడానికై ఆ కార్యక్రమాలలో పాల్గొనడానికి ప్రోత్సాహం లభిస్తుంది.

గ్రామాలలో రేడియో సెట్లను పెట్టడానికై భారత ప్రభుత్వము ఒక సబ్సిడీ పథకాన్ని ప్రవేశపెట్టింది. దీనివల్ల కొన్ని వందల రూపాయలుమాత్రమే ఆదాయంగల చిన్న పంచాయితీలకుకూడా రేడియోసెట్లు లభింపజేయబడుతవి. ఈ పథకాన్ని అనుసరించి రేడియో సెట్టుఖరీదులో సగాన్ని భారతప్రభుత్వం సబ్సిడీగా ఇస్తుంది. మిగిలిన సగాన్ని గ్రామాలు భరించాలి. రాష్ట్ర ప్రసారశాఖ ఈ క్రింది నియమావళి ననుసరించి గ్రామకేంద్రాలలో రేడియోసెట్లను నెలకొల్పి వాటిని నిర్వహిస్తుంది.

(1) రేడియోసెట్టు ఖరీదు :– గ్రామకేంద్రం రేడియో సెట్టు ఖరీదులో సగం మొత్తమును అంటే రూ. 150 లను స్థానిక ప్రభుత్వ ట్రెజరీలో "XLVI— N. Misc — కంట్రిబ్యూషన్సు టు స్టేట్ బ్రాడ్‌కాస్టింగ్" అను పద్దుక్రింద చెల్లించి అందుకు చాలాన్ పొంది ఆ చాలాన్‌ను అసిస్టెంట్ రేడియో ఇంజనీరు, స్టేట్ బ్రాడ్‌కాస్టింగ్ డిపార్టుమెంటు, 78/ తూర్పు ముకరంజాహీరోడ్డు, హైదరాబాదు-దక్కన్ చిరునామాకు పంపవలెను.

(2) అ. నిర్వహణ ఖర్చులు : రేడియోసెట్టు 1 కి ఏడాదికి రూ. 120 ల చొప్పున నిర్వహణఖర్చును గ్రామకేంద్రం చెల్లించవలెను. మొదటి సంవత్సరపు నిర్వహణఖర్చులను అంటే రూ. 120 లను రేడియోసెట్టు ఖరీదుతోసహా పైన పేర్కొనబడిన పద్దుక్రింద చెల్లించి, దాని చాలాన్‌ను అసిస్టెంటు రేడియో ఇంజనీరు, హైదరాబాదుకు పంపవలెను.

(2) ఆ. ఈ ఖర్చులలో రేడియోసెట్టు ఉపయోగంలో వుండగా ఏ భాగాలనయినా తీసివేసి కొత్తభాగాలను వేయవలసివస్తే అందుకయ్యే ఖర్చులుకూడా చేరియున్నవి.

(2) డిశ్చార్చి అయిపోయిన బ్యాటరీలను మొదలగు వాటిని తీసివేసి కొత్తవాటిని వేయుట : సెట్టు పనిచేయక పోయినట్లయితే పంచాయితీబోర్డువారు హైదరాబాదులోని అసిస్టెంటు రేడియో ఇంజనీరుకు వ్రాయవలెను. అప్పుడది రెండుమూడు రోజులలోపల తిరిగి పనిచేయునట్లుగా మరమ్మతు చేయబడుతుంది.

(3) గ్రామకేంద్రం ఒక ఇన్ఫర్మేషన్ ఫారమును పూరించి దానిని చాలాన్‌తోపాటుగా హైదరాబాదులోని అసిస్టెంటు రేడియో ఇంజనీరుకు పంపవలెను.

(4) గ్రామంలో రేడియోసెట్టు ఎవరి ఆధీనములో వుండునో వారు దానిని ప్రతిరోజు సాయంత్రం 6 గం. లు మొదలు 8 గం. ల వరకు రెండుగంటలపాటుపెట్టి గ్రామస్తులు గ్రామసీమ కార్యక్రమాలను ముఖ్యంగా హైద్రాబాదు స్టేషన్‌నుంచి గ్రామస్తులకొరకు ప్రసారం చేయబడు కార్యక్రమాలను వినుటకు తోడ్పడవలెను.

(5) గ్రామకేంద్రపు రేడియోసెట్టు ఎవరి ఆధీనములో వుండునో వారు, గ్రామ పంచాయితీ అధ్యక్షులు మొదలగు వారు సెట్టును నెలకొల్పునప్పుడు దానిని భద్రంగా వుంచుతామనీ, సక్రమంగా నిర్వహిస్తామనీ పూచీ యివ్వవలెను.

తెలంగాణా జిల్లాలలో నెలకొల్పడానికై 400 కమ్యూనిటీ రేడియోసెట్లు సిద్ధంగావున్నవి.

* * *

# గోదావరి: దక్షిణాపథ ప్రజల భవితవ్యానికి ఆశాజ్యోతి

శ్రీ ఆర్. శివసుబ్రహ్మణ్యం
(సూపరింటెండింగ్ ఇంజనీరు, ధవళేశ్వరం సర్కిల్)

నదీజలాల విషయంలో ఆంధ్రప్రదేశ్ సుసంపన్నమయినది. భారతదేశంలోని గొప్పనదులలో రెండునదులు అంటే కృష్ణా గోదావరులు ఆంధ్రదేశంగుండా ప్రవహిస్తున్నవి. ఇవేగాక వంశధార, నాగావళి, పెన్నారు మొదలగు మధ్య రకం నదులుకూడా ఉన్నవి. వీటి ఆరగాణి కొన్నివేల ఎకరాయున్నది. ఇవి 1 లక్ష మొదలు 4 లక్షల ఎకరాలవరకు సాగునీటిని అందజేయగలవు. శారద, తాండవ, యేలేరు, ఎర్రకాలువ మొదలగు చిన్ననదు లున్నవి, వీటివల్లకూడా దాదాపు లక్ష ఎకరాలకు సాగునీరు లభిస్తుంది.

పెద్దనదులలో కృష్ణానది, దాని ఉపనది అయిన తుంగభద్ర సంపూర్తిగా వినియోగించుకో బడుతున్నవి. పైన పేర్కొనబడిన ఇతర నదులకుకూడా తగు పథకములు సిద్ధపరచబడినవి. గోదావరినది ధవళేశ్వరం ఆనకట్ట మినహా మరెచ్చటనూ వినియోగింపబడడంలేదు. ధవళేశ్వరం ఆనకట్టవల్ల గోదావరినీటిలో నూటికి 6 వంతులుమొదలు 8 వంతులవరకు మాత్రమే ఉపయోగింపబడుతున్నది. కనుక ఈ నదివల్ల ప్రయోజనం పొందడానికి ఎంతో అవకాశం గలదు. అందుచేతనే ఈ నది మనకు ఆశాజ్యోతివలె వున్నది. పరిపాలకులు, రాజనీతివేత్తలు మంచిపేరు పొందటానికీ, ఇంజనీర్లు తమశక్తి యుక్తుల నన్నిటినీ వెచ్చించి దీని జలాలను ఎక్కువ లాభసాటిగా వినియోగానికి తేవడానికీ ఈ మహానది తగు అవకాశాలను కల్పిస్తున్నది.



భద్రాచలంవద్ద గోదావరి



పుష్కర స్నానాలు చేస్తున్న జనసందోహం

గోదావరి చాలా ప్రాచీనమయిన నది. దీనిని గౌతమి అని కూడా అంటారు. ఇది పుణ్యనది. మన పవిత్ర గ్రంథాలలో గంగ, యమున, సరస్వతులతోపాటు గోదావరి ప్రస్తావన కూడా కలదు. భారతదేశంలో ఆదికావ్యమని చెప్పదగిన రామాయణములోకూడా దీని ప్రస్తావనవున్నది. ఆ మహాకావ్యంలోని విశిష్ట సంఘటన లెన్నో ఈ నదీతీరముననే, దీని పరిసరములలోనున్న అరణ్యంలోనే జరిగినవి.

## వింధ్యకు ఇద్దరి గొప్పనది

వింధ్య పర్వతములకు దక్షిణప్రాంతంలోవున్న నదులన్నిటిలో గోదావరి పెద్దది. ఇది భారతదేశ ద్వీపకల్ప భాగమునకు అడ్డంగా సువిశాలప్రాంతంలో ప్రవహిస్తున్నది. పడమటి కనుమలలో నాసిక్ జిల్లాలోని త్ర్యంబకంవద్ద జన్మించి తూర్పుతీరంవైపు 900 మైళ్ళు ప్రవహించి ఇది బంగాళాఖాతంలో కలుస్తున్నది. మొదటి 800 మైళ్ళ దూరంలోనే ఉపనదులన్నీ ఇందులో కలుస్తున్నవి. కుడివైపునుంచి మంజీర, ఎడమవైపునుంచి ప్రాణహిత, ఇంద్రావతి, శబరి దీనిలో కలుస్తున్నవి. శబరి చిట్టచివరి ఉపనది. అది కలసిన తరువాత గోదావరి తూర్పు కనుమలలోకి చొచ్చి దాదాపు 25 మైళ్ళు వంపుసొంపులతో ప్రవహిస్తూ పోలవరంవద్ద మైదానభూమిలో బయల్పడుతుంది. పోలవరం ఆంధ్రదేశంలోని ప్రముఖ వైజ్ఞానిక కేంద్రములలో ఒకటియైన రాజమహేంద్రవరమునకు 25 మైళ్ళ ఎగువనవున్నది. ఈనదిపై దుమ్ముగూడెంవద్ద, ధవళేశ్వరంవద్ద ఆనకట్టలు, రైలు మార్గములకు రైలువంతెనలుతప్ప మరెట్టి నిర్మాణాలులేవు. దుమ్ముగూడెం ఆనకట్ట పడవల రవాణాను సుకరం చేయడానికీ, ధవళేశ్వరం ఆనకట్ట సాగునీటికీ, పడవల రవాణాకూ నిర్మింపబడ్డవి. ఆంధ్రప్రదేశ్ హద్దులనుంచి దిగువవైపు ఈ నదిలో ప్రయాణం చేస్తూవుంటే మొదట పవిత్రమయిన పర్ణశాల దేవాలయములు కన్పిస్తాయి. దాదాపు 20 మైళ్ళు దిగువన భద్రాచలేశ్వరుని దేవాలయం తెల్లగోడలు, బంగారు ఛాయగల ఆ దేవాలయ విమానం కన్పించి మనలో భక్తిభావాన్ని కలుగజేస్తాయి. ఇంకా 35 మైళ్ళు దిగువన శ్రీరామగిరి కలదు. అక్కడినుంచే గోదావరి కనుమల ముఖద్వారములు మొదలవుతాయి. ఈ దృశ్యం ఎంతో పవిత్రమయినది.

## అందమైన సరస్సులు

ఆ తరువాత రమణీయమైన దృశ్యాలు మొదలవుతాయి. గోదావరి తూర్పుకనుమలలోకి చొచ్చుకొనిపోవడం ప్రారంభ

మవుతుంది. మొదటి నాలుగుమైళ్ళవరకు గోదావరి వెడల్పు ఒక ఫర్లాంగుమాత్రమే. నదికి రెండువైపులా 2,000 అడుగుల ఎత్తున కొండలున్నాయి. ఈ కొండలు నిట్రముగా వున్నప్పటికీ జాలువారుడుగాలేవు. ఇచ్చట గోదావరి వంపులు దీరి ప్రవహిస్తూ నేత్రపర్వంగా కనిపించే సరస్సును రూపింపజేస్తుంది. ఆ సరస్సులను ఆనుకొని పచ్చనికొండలుంటాయి. నదికి వరదలు వచ్చినప్పుడు బురదనీరు రెండు ఒడ్డులను ఒరుసుకొని ప్రవహిస్తూ ఉంటే ఆ దృశ్యం చూచి తీరవలెను. వేసవికాలంలో నదిలోని పరిశుభ్రమైన నీటిలో కొండలు, ఆ కొండలపైని చెట్టుచేమలు ప్రతిబింబిస్తూ చూడడానికి అది ఒక పచ్చని సరస్సువలె కనిపిస్తుంది. ఫర్లాంగు వెడల్పుగలచోట మంచి వరదలు వచ్చినప్పుడు నదిలోతు రమారమి 100 గజములు ఉండవచ్చు. అయితే నీటి ఉరవడి సెకండుకు రమారమి 20 అడుగులు, గంటకు దాదాపు 15 మైళ్లు ఉండడంచేత ఇక్కడ నదిలోతును ఎవ్వరూ ప్రత్యక్షంగా కనుక్కొనలేరు. భూగర్భ పరిణామయుగంలో గోదావరి కనుమలవరకు సముద్రం విస్తరించి ఉండవచ్చుననీ, అందుచేతనే గోదావరి నదీగర్భం సముద్ర మట్టానికి 40 మొదలు 50 అడుగులు తక్కువగా ఉన్నదనీ భూగర్భ శాస్త్రజ్ఞులు చెబుతారు.

పోలవరం కనుమకు దిగువన 20 మైళ్ళదూరంలో గోదావరి వెడల్పు ఒకమైలు. ఇంకా 20 మైళ్ళ దిగువన రాజమండ్రి రైల్వేక్రాసింగ్‌వద్ద నదివెడల్పు 2 మైళ్ళు. ధవళేశ్వరం దగ్గర వెడల్పు 6 మైళ్ళు. ఇంకా దిగువన వెడల్పు 4 మైళ్లు. ఇక్కడ నది ప్రవాహవేగంతో కడు గంభీరంగా కన్పిస్తుంది. అమెరికాలో పెద్దపెద్ద ఆనకట్టలు నిర్మించడంలో అనుభవం



పుష్కర స్నానాలు చేస్తున్న ప్రజలు మరొక దృశ్యం

పున్నట్టి ఒక గొప్ప ఇంజనీరు పోలవరందగ్గిర గోదావరిని చూచి అమెరికాదేశపు నదులకంటె ఈ నదిచూడడానికి చాలా అద్భుతంగా ఉంటుందని అన్నాడు.

## ఆరగాణి

. ఇక గోదావరి జలశక్తిని పరిశీలిద్దాము. ఈ నది ఆరగాణి దాదాపు 1,20,000 చదరపుమైళ్ళు. అంటే ప్రస్తుత ఆంధ్ర ప్రదేశ్ విస్తీర్ణంకంటె ఇది కొంచెం హెచ్చుగానేవున్నది. చిత్రమేమిటంటే గోదావరికి మొత్తం ఆంధ్రప్రదేశ్ ఆర గాణిగావున్నది.

గోదావరి నీటిమట్టం దుమ్ముగూడెం, ధవళేశ్వరం ఆన కట్టలవద్ద కొల్చి లెక్కకట్టబడుతుంది. రోజుకు రెండు పర్యా యములు ఆనకట్టపై నీటిమట్టంకొలత తీసుకోబడుతుంది. ధవళేశ్వరం ఆనకట్టకు 4 సెక్షనులున్నవి. ఈ 4 సెక్షనుల నిడివి దాదాపు 12,000 అడుగులు. ఈ నిడివిలో మూడు పైతూములు, మూడు దిగువ తూములు వున్నవి. ఇక్కడ నాలుగు సెక్షనులపైనుంచి ప్రవహించిపొయ్యే నీటి సగటు లెక్క తీసుకోబడుతుంది.

ఇంతవరకు రికార్డు అయిన లెక్కలను బట్టి బైటికి పొయ్యే నీటి గరిష్ఠ ప్రవాహం 1953 అగస్టులో 29 లక్షల క్యూజెక్కులని తేలినది. ఇదేగరిష్ఠ ప్రవాహం గంగానదిలో 17 లక్షల క్యూ జెక్కులని చెబుతున్నారు. గోదావరిలో 16 మొదలు 20 లక్షల క్యూజెక్కుల గరిష్ఠ నీటి ప్రవాహం సకృత్తుకాదు. దాదాపు ప్రతిసంవత్సరం 10 మొదలు 16 లక్షల క్యూజెక్కుల గరిష్ఠం ఉండనే ఉంటుంది. అన్నిటికంటె తక్కువ నీటి ప్రవాహం 1952 లో 5 లక్షలక్యూజెక్కులు. నదీ తీరమునకు సమీపంలో వున్నపట్టణముల, జనాభాయొక్క భద్రత దృష్ట్యా గరిష్ఠ ప్రవాహం లెక్కకు తీసుకోబడుతుంది కాని నదీజలాల వినియోగం దృష్ట్యా నదిలో ప్రవహించే మొత్తం నీటిని లెక్కగట్టవలసి ఉంటుంది. ఈమొత్తం సంవత్సరంయొక్క గరిష్ఠ ప్రవాహ ఫలంకాదు. 1933-34 సంవత్సరంలో ఏడాది గరిష్ఠ ప్రవాహం 4934 టి. యం. ఘనపుటడుగులు. 1920-21 లో ఏడాది కనిష్ఠ ప్రవాహం 930 టి. యం. ఘనపుటడు గులు మాత్రమే. గత 35 ఏండ్లలో సగటు వార్షిక ప్రవాహం 3428 టి. యం. ఘనపుటడుగులు. వర్షములు కురియనట్టి జనవరి మొదలు జూన్ వరకు గల కాలంలో నదీప్రవాహం తగ్గిపోతుంది. ఏప్రిల్ నెలలో 2000 మొదలు 3000 క్యూజె క్కుల ప్రవాహం ఉంటుంది. ఈ విధంగా సాధారణ నీటి ప్రవాహం కనిష్ఠ నీటిప్రవాహమునకు దాదాపు వెయ్యిరెట్లు ఉంటుంది. కాని హిమాలయ పర్వతములలో జన్మించే గంగ, సింధు, బ్రహ్మపుత్ర మొదలగు నదుల నీటి ప్రవాహ వ్యత్యాసం ఇంతగా ఉండదు. ఎందుచేతనంటే ఋతుపవన ముల వల్ల జులై మొదలు డిసెంబరు వరకు గోదావరికి వరదలు వస్తాయి. కాని హిమాలయముల మంచుకొండలు వేసవిలో కరిగి అప్పుడు అక్కడి నదులలో వరదలు సంభవిస్తాయి.

ఈ విధంగా గోదావరి నీరు వ్యర్థంగా ప్రవహించిపోతు న్నది. ఈ నీటిని సద్వినియోగం చేసుకోవాలంటే రిజర్వా యర్లు అవసరం. మన పూర్వీకులు పెద్దనదులు వేటిపై కూడా రిజర్వాయర్లను నిర్మింప ప్రయత్నించలేదు. అవి ఎలా నిర్మించాలో వారికి తెలియక పోవడమే కారణమని కొంద రనవచ్చు. కాని మరొకవిధంగా ఆలోచిస్తే వారు ఈ నదు లను పవిత్రమైనవాటిగా భావించేవారనీ, కనుక వాటి ప్రవా హాలను అరికట్టడం అపవిత్ర కార్యంగా భావించేవారనీ ఎందుకు అనుకోకూడదు ?

## ఆనకట్టలు

సరే, కారణమేమైనప్పటికీ భారతదేశంలో పూర్వకాలం నదులకు కట్టబడిన పెద్ద ఆనకట్టలలో దాదాపు 2000 ఏండ్ల క్రిందట చోళరాజులు కావేరి నదికి కట్టించిన ఆనకట్టయే ముఖ్యంగా చెప్పుకోదగింది. ఇంతటి పెద్ద ప్రయత్నం మరొకటి చరిత్రలో ఎక్కడా ఉల్లేఖింపబడలేదు. మళ్ళీ 14, 15 శతాబ్దాలలో తుంగభద్రపై విజయనగర రాజులు కొన్ని ఆనకట్టలు నిర్మించారు. పాశ్చాత్యదేశాలు కళలు, విజ్ఞాన శాస్త్రం, సాహిత్యములలో ఎంతో అభివృద్ధిజెంది నప్పటికీ ఇదేకాలంలో పెద్ద పెద్ద సాగునీటి ప్రాజెక్టులను నిర్మించడంలో వారుముందంజవేసినట్లు చరిత్రలోకానరాదు. విజయనగర సామ్రాజ్య పతనం తరువాత చారిత్రక స్థితి గతుల కారణంగా పెద్ద నీటివనరు ప్రాజెక్టులు నిర్మించడం జరుగలేదు. ఆ తరువాత బ్రిటిషు ఇంజనీర్లు భారతదేశం వచ్చారు. సాగు నీటి విశేషాలను వారు ఇక్కడే నేర్చు కున్నారు. ఆ విజ్ఞానాన్ని దీక్షా సామర్థ్యములతో ఈ దేశం మేలుకొరకే వినియోగించారు. అట్టివారిలో సర్ ఆర్థర్ కాటన్ దొర ప్రత్యేకంగా చెప్పుకోదగినవాడు ఆయన ఇప్పటికి నూరేళ్ళక్రితం ధవళేశ్వరం ఆనకట్టను కట్టించాడు. పురాతనమైన కావేరినది ఆనకట్టను చూచి ప్రేరేపితుడై ఆయన ఈ మహాప్రయత్నం సంకల్పించాడు. గోదావరినదిని గూర్చి కలలు గని దానివల్ల ఏవేవో సత్ఫలితాలు ఆశించిన

వ్యక్తి ఆయన. ఆయన కేవలం కలలు మాత్రమే కనలేదు. వాటిని ఆచరణలో పెట్టి వాస్తవం చేశాడు. అద్భుతమైన ఈ కృషితో ఆతడు ఎందరో ఇంజనీర్లకు ప్రోత్సాహ కారకుడైనాడు. ఆయన అడుగుజాడల ననుసరిస్తూ, బ్రిటిషు పరిపాలన మనకు వొదిలిపోయిన విధానాలను మనకు అనుగుణంగా చేసుకుంటూ ఈ మహానదిపై మనం ఎన్నో ఆశలు పెట్టుకొని వున్నాము. ఈ నదీలోయలో గొప్ప ప్రాజెక్టులను నిర్మింపవలెనని అభిలషిస్తున్నాము.

ఒక శతాబ్దం క్రితం ఈ నదీజలాలు డెల్టా ప్రాంతంలో సాగుకు ఉపయోగింపబడేవి. నది యొక్క పాయలగుండా ప్రవహించే నీరే ఆవిధంగా ఉపయోగింపబడేది. అయితే అది అస్థిరమైనపద్ధతి. ఎందుచేతనంటే నదిలో ప్రవహించే నీటిమట్టంపై ఆసాగు ఆధారపడివుంటుంది. ఆ విధంగా దాదాపు లక్షఎకరాలు సాగుఅవుతూ వుండేది. నదిలో వరదలు వొచ్చిన సంవత్సరం సాగుపొలాలు ధ్వంసమై పొయ్యేవి. మరొక సంవత్సరం సరిపోవునంత నీరు లేక కరువు కాటకాలు సంభవిస్తూ వుండేవి. కాని ఆనకట్టలు నిర్మించి, కాలువలు త్రవ్వడంతో ఆధారపడి వుండదగిన ప్రవాహాన్ని బట్టి కాలువలలో నీటి మట్టాన్ని హెచ్చిస్తూ తగ్గిస్తూ విశాలమైన భూములకు సాగునీటిని సరఫరా చేయవలసువడుతున్నది. ఆనకట్టకు, కాలువలకు ఈ నూరేండ్లలో కొద్దిపాటి అభివృద్ధిపనులు జరపడం వల్ల ఇప్పుడు మొదటి పంట క్రింద 8.2 లక్షల ఎకరాలు, రెండవ పంట క్రింద దాదాపు 3లక్షల ఎకరాలు సాగుఅవుతున్నవి. కాని గోదావరి శక్తిస్తోమత లేమిటి ? ఈ నదికి గల 120,000 చదరపు మైళ్ళ ఆరగాణిని బట్టి చూస్తే 100 లక్షలు లేదా ఒకకోటి ఎకరాల భూమికి ఇది సాగునీరు అందజేయగలుగుతుంది. ప్రతి సంవత్సరపు వాస్తవ నీటి ప్రవాహాన్ని బట్టి లెక్కవేస్తే 200 లక్షలు లేదా 2కోట్ల ఎకరాలు సాగుఅవుతాయి. అన్నిటి కంటె చెడ్డ సంవత్సరమని రికార్డు అయిన 1920-21 సంవత్సరపు నీటి ప్రవాహాన్ని బట్టి చూస్తే 50 లక్షల ఎకరాలైనా సాగుఅవుతాయి.

## రిజర్వాయర్లు అవసరం

ప్రతి సంవత్సరం నదిలో వచ్చే ప్రవాహాన్ని వినియోగించుకోవడానికి రిజర్వాయర్లు నిర్మిస్తేనే పైఅంకెలు చెప్పుకోవడం వల్ల ప్రయోజనం ఉంటుంది. అట్టి రిజర్వాయర్లు ఉన్నాయని అనుకొనే పై సంఖ్యలు తేల్చబడినవి. ప్రస్తుతం మనం నదినీటిలో నూటికి 6 మొదలు 8 వంతులను మాత్రమే ఉపయోగించుకుంటున్నాము. ఇంకా ఎక్కువ నీటిని వినియోగించుకోవాలంటే రిజర్వాయర్లు అవసరం.

ఇప్పటికి ఒక దశాబ్దం క్రితమే పోలవరం వద్ద రిజర్వాయరును నిర్మించడానికై పరిశోధనలు జరుపబడినవి. ఈ రిజర్వాయరు వల్ల ప్రస్తుతమున్న డెల్టా కూడా కలుపుకొని మొత్తం 30 లక్షల ఎకరాలు సాగుఅవుతాయి. అయితే ఇక్కడ రిజర్వాయరు నిర్మించాలంటే అడుగున రాయితగిలే దాకా పునాదులు పోవాలంటే నదీగర్భంలో 200 అడుగుల లోతు త్రవ్వాలి. పోలవరం డాముస్థలం వద్ద ఇట్టి పెద్ద పునాదులలో నుంచి నీటిని తోడివేయాలంటే దీనికి ప్రత్యామ్నాయంగా గోదావరి కనుమకు ఎగువన 15 మైళ్లదూరంలో ఇచ్ఛాపురు వద్ద మరొక స్థలం గత రెండు మూడేండ్లలో పరిశోధింపబడింది. ఇక్కడ అడుగున రాయి తగిలేదాకా పునాదులు పోవాలంటే నదీగర్భంలో 50 లేక 60 అడుగుల లోతు త్రవ్వితే చాలు. డామును, రిజర్వాయర్లను ఇక్కడ నిర్మించవచ్చును. ఇక్కడ నీటి ప్రవాహాన్ని వొదిలి, అలా వొదిలిన నీటిని పోలవరం బ్యారేజి ద్వారా నిలువచేసుకొనవచ్చును. అక్కడి నుంచి మొదట తలపెట్టబడినట్లుగా రెండువైపులా కాలువలు తీయవచ్చును. పోలవరం వద్ద మొదట తలపెట్టబడిన డాముకు అయ్యే ఖర్చు కంటే ఇచ్ఛాపురు డాముకు, పోలవరం బ్యారేజీకి అయ్యే ఖర్చు చాలా తక్కువగా ఉండగలదు.

ఈ రిజర్వాయరువల్లకూడా నదియొక్క సగటు నీటిలో నూటికి 30 వంతుల నీటినిమాత్రమే వినియోగించుకున్నవాళ్ళమవుతాము. మిగిలే నీటిని ఉపనదులపై రిజర్వాయర్లు నిర్మించి ఉపయోగించుకోవచ్చు. అప్పుడు దేశంలో ఎక్కడ చూచినాపరిపొలాలు, తోటలుఏర్పడి అంతాసస్యశ్యామలంగా కన్పిస్తుంది. ఇక వరదలభయం వుండదు. ప్రస్తుతమున్న డెల్టా ప్రాంతాన్ని ఇంకా విస్తరించి ధవళేశ్వరం ఆనకట్టపై ఎత్తయిన షట్టర్లు పెట్టి దూరంగావున్న పొలాలకుకూడా బాగా నీరు సరఫరా చేయవచ్చును. ఇప్పుడున్న 3 అడుగుల ఉక్కు షట్టర్లకు బదులుగా 6 అడుగుల ఎత్తువుండి గాలివల్ల పనిచేసే డ్రమ్‌గేటు రకం షట్టర్లను పెట్టడానికి ప్రయోగాలు చేయబడుతున్నవి. రిజర్వాయరువద్ద జలవిద్యుచ్ఛక్తి పథకాలను సులభంగా అమలుపరచవచ్చును. గోదావరిపై తలపెట్టబడిన రామపాదసాగరం* రిజర్వాయరువల్ల 1,20,000 కిలోవాట్ల జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది. ఈ రిజర్వా

* ఇప్పుడిది విరమింపబడింది, దీనికి బదులుగా అదిలాబాదు జిల్లాలో కొత్తస్థలం ఎన్నిక చేయబడింది.

యర్ గోదావరినదిలో సుడిగుండాలను ఉరవళ్ళను తొల గించి, నదీజలం సమతలంగా విస్తరించునట్లుజేసి పడవల రవాణాకు సౌకర్యం కలుగజేస్తుంది. రెండువైపులా పడవలు పొయ్యేవిధంగా కాలువలను నిర్మించడంవల్ల విశాఖపట్నం ఓడలరేవు మొదలు మద్రాసుకు దక్షిణం వరకు పడవల రవాణా వీలుపడుతుంది. ప్రస్తుత డెల్టా కాలువలవల్లనే ప్రతి సంవత్సరం గోదావరిలో పడవలద్వారా రవాణా అయ్యే సరుకుల విలువ దాదాపు 2 కోట్లువుంటుంది. రవాణా అయ్యే కలప విలువకూడా రూ. 2 కోట్లువుంటుంది. ప్రయాణీకుల రాకపోకలవిలువ 10 లక్షలదాకా ఉంటుంది.

## అడవులు, ఖనిజసంపద

గోదావరినదిలో ప్రవాహదశలో సారవంతమయినఒండ్రు మన్ను కొట్టుకువస్తుంది. ప్రతి సంవత్సరం దాదాపు 150 మిలియను టన్నుల ఒండ్రు లేదా మొత్తం ప్రవాహములో 0.1 శాతం ఒండ్రు వుంటున్నట్లు రామపాదసాగరం పరి శోధనల సందర్భంలో తెలియవచ్చింది. గోదావరి బేసిన్ భూమి సంపన్నవంతమయినది. ఇందులో మంచి అడవులు ఉన్నవి. వాటిని అభివృద్ధిపరచి వాటివల్ల లాభం పొంద డానికి ఎన్నో అవకాశాలున్నవి. ఈ బేసిన్ భూమి లోపలి భాగంకూడా సారవంతమయినదే. ఈ బేసిన్‌లో ఆదికాలపు అడవి ఒకటి భూమి అడుగున పడిపోయింది. ఇప్పుడు అదిఅంతా బొగ్గుగామారింది. డెల్టాప్రాంతాలలో గ్యాస్ పొలములుకూడా ఉన్నవి. రిజర్వాయరు ప్రాజెక్టులవల్ల జల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది. దానిని గోదావరి లోయ లోని అటవీ, ఖనిజ సంపదను వినియోగానికి తెచ్చుకోవ డానికి ఉపయోగించవచ్చును. రిజర్వాయర్‌నుంచి భారీరకం పంపింగ్ స్కీములకు, కాలువలనుంచి పంపింగ్ పనులకు ఆ విద్యుచ్ఛక్తిని ఉపయోగించి మెట్టభూములకుకూడా సాగు నీరు అందజేయవచ్చును.

దక్షిణాపథంలోని గొప్పనదులలో కావేరి, మద్రాసు రాష్ట్రంలోని ఇతరనదులు పూర్తిగా వినియోగానికి తేబడినవి. ఆంధ్రప్రదేశ్‌లో పెన్నార్, తుంగభద్ర, కృష్ణా నదులను పూర్తిగా వినియోగించుకునేందుకై పథకములు ఇప్పుడు అమలు జరుగుతున్నవి. చివరకు మిగిలింది. గోదావరి, చివరకు మిగిలినా ఇది చిన్నది కాదు. చాలా గొప్పది. ఆంధ్ర ప్రదేశ్ ప్రజలకిది ఆశాజ్యోతిగా వున్నది. గోదావరి చెల్లెళ్ళయిన కృష్ణా, పెన్నారు, కావేరీ నదులు తమశక్తి కొలది జలాల నందజేస్తూ తమకంటే పెద్దదీ, ఉదార స్వభావురాలు అయిన గోదావరి అక్కయ్య తమకు సహా యంగా రావాలని నిరీక్షిస్తున్నవి. కనుక ఇక ఆంధ్ర ఇంజ నీర్లు తమ శేముషీ విశేషాలను వినియోగించి ఈ నదిపై నవ్యాంధ్ర రాష్ట్రం పెట్టుకొనివున్న ఆశలను కార్యరూపం దాల్చజేసి ఆంధ్రప్రదేశ్ అక్షరక్రమంగా భారతదేశంలోని మొట్టమొదటి రాష్ట్రం కావడమే గాక అభివృద్ధిలో, సిరి సంపదలలో భారతదేశంలోని ప్రప్రథమంగా గణించదగిన రాష్ట్రాలలో ఒకటిగా చేయవలసిన బాధ్యతవహించాలి.

*(ఏ. ఐ. ఆర్. విజయవాడ సౌజన్యంతో)*

# డైరీ

1. ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ బ్రహ్మాండమయిన బహిరంగసభలో ఉపన్యసిస్తూ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి లాంఛనంగా ప్రారంభోత్సవం జరిపారు.

2. హైదరాబాదు నగరంలోని సరోజినీదేవి మెమోరియల్ హాలుకు ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ ప్రారంభోత్సవం జరిపారు.

3. రాష్ట్ర ముఖ్యమంత్రి 34 వ అఖిల భారత సహకార సప్తాహాన్ని ప్రారంభించారు. ఈ సప్తాహం హైదరాబాదు సెంట్రల్ కో ఆపరేటివ్ యూనియన్ అధ్వర్యాన జరిగింది.

4. ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గంలోని వివిధమంత్రులకు కేటాయింపబడిన శాఖలు వెల్లడింపబడినవి.

5. ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం ప్రథమ పర్యాయంగా సమావేశమయింది.

6. రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ యన్. సంజీవరెడ్డి షాద్ నగర్‌లో ప్రసంగిస్తూ రాష్ట్రంలో ఇదివరకే పన్నులభారం పూర్తిగా వుందికాబట్టి ఇక కొత్తపన్నులు విధించడం సాధ్యం కాదని తెలిపారు.

7. అమెరికా సంయుక్త రాష్ట్రాల సాంకేతిక సహకార పాలకవర్గంతాలూకు వ్యవసాయ కార్యక్రమం అధిపతి మిస్టర్ డబ్ల్యు. యస్. మిడ్డాగ్ హైదరాబాదులో పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ అభివృద్ధిచెందని దేశాలకు అమెరికాదేశం సాంకేతిక సహకారపాలకవర్గంద్వారా చేస్తున్న సాంకేతిక సహాయం దీర్ఘకాల ప్రాతిపదికపై ఇకముందు కూడా కొనసాగించ బడగలదని తెలిపారు.

8. సోషలిస్టుపార్టీ "ఈజిప్టు దినోత్సవం" జరిపింది. ఆ సందర్భంలో మూడు ఊరేగింపులు తీయబడినవి. ఒక బహిరంగసభలో ఈజిప్టుపై ఆంగ్లో-ఫ్రెంచి దురాక్రమణ ఖండించబడింది.

9. రాష్ట్రప్రభుత్వ ప్రధానకార్యదర్శి ఒక స్థానిక సమావేశంలో ప్రసంగిస్తూ రాష్ట్రంలో వ్యవసాయం, పారిశ్రామికాభివృద్ధి — ఇవిరెండూ సమన్వయం చేయబడవలసిన ప్రాధాన్యాన్ని నొక్కిచెప్పారు.

10. భారతప్రభుత్వం అఖిలభారత సర్వీసుల పునర్వ్యవస్థీకరణ కేడర్ ననుసరించి 1956 నవంబరు 1 తేదీనుంచి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి కేటాయించిన 45 మంది ఐ. ఏ. యస్. ఆఫీసర్లు, 26 మంది ఐ. పి. యస్. ఆఫీసర్లపేర్లు వెల్లడింపబడినవి.

11. దేశం మొత్తంలో గోవధను నిషేధించడానికై తక్షణమే తగుచర్యలు గైకొనవలసిందిగా రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలను కోరుతూ హైద్రాబాదు సికింద్రాబాదు నగరములకు చెందిన ఎనిమిది రాజకీయ సాంఘిక సంస్థలు ఒక బహిరంగసభలో తీర్మానించినవి.

12. భారతప్రభుత్వం నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు మరి రూ. 38 లక్షలు అప్పుగాయిచ్చింది.

13. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు ఎవరెవరు ఏ యేజిల్లాలపని చూడగలరో ఆ విషయం వెల్లడింపబడింది. ఆ పని విభజన తక్షణమే అమలులోకి వచ్చినట్లుగా ప్రకటింపబడింది.

14. ఆంధ్ర మద్రాసు రాష్ట్రాలమధ్యగల సరిహద్దు వివాదాన్ని సామరస్యపూర్వకంగా పరిష్కారం చేయడానికై యూనియన్ ప్రభుత్వ న్యాయ వ్యవహారాలమంత్రి పంపబడినారు.

15. ధరలను అదుపులోనికి తేవడానికై ఆంధ్రప్రాంతములో తెరువబడిన చౌక దుకాణాలసంఖ్య విషయమై సవివరమయిన నివేదికను పంపవలసిందిగా ప్రభుత్వం జిల్లా కలెక్టర్లను కోరింది.

16. ఆంధ్రప్రదేశ్ హైకోర్టుకు అదనంగా మరొక న్యాయమూర్తిని రాష్ట్రపతి నియమించినట్లు వెల్లడింపబడింది.

17. విశాఖపట్నంలో డీసెల్ ఇంజనులను ముఖ్యంగా మెరీన్ డీసెల్ ఇంజనులను తయారుచేసే యంత్రనిర్మాణ

శాలను భారతప్రభుత్వం త్వరలో నెలకొల్పగలదని యూనియన్ ప్రభుత్వ ఉత్పత్తిశాఖామంత్రి హైదరాబాదులో వెల్లడించారు.

18. ద్వితీయ పంచవర్ష ప్రణాళికను అమలు జరుపడంలోను, రాష్ట్రంలోని పరిశ్రమలను అభివృద్ధి పరచడంలోను రాష్ట్రప్రభుత్వముతో సంపూర్ణంగా సహకరించవలసిందిగా ముఖ్యమంత్రి పారిశ్రామికులను, వ్యాపారస్తులను కోరారు.

19. భారతప్రభుత్వపు సర్వేశాఖ పంపించిన ఒక జట్టు సీలేరు జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు ప్రాంతాన్ని విమానములోనుంచి పరిశీలనచేసింది.

20. వంశధారనదిపై రిజర్వాయర్ నిర్మాణానికి ఆంధ్ర ఒరిస్సా రాష్ట్రాలు సూచించిన స్థలాన్ని సందర్శించి నివేదికను దాఖలుచేయడానికై కేంద్ర జల, విద్యుచ్ఛక్తి కమీషన్‌వారు తమ డైరెక్టర్లలో ఒకరిని పంపుతున్నారు.

21. స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు తాలూకు వాటా ధనాన్ని ఇండియా రిజర్వుబ్యాంకుకు మార్పుచేసే బిల్లును లోక్‌సభ ఆమోదించింది.

22. ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని కేంద్రప్రభుత్వం స్వాధీనపరచుకోవడం రాష్ట్రప్రభుత్వానికి సమ్మతం కాదని ముఖ్యమంత్రి అన్నారు.

23. ఆరు పరిశ్రమలకు జాతీయవేతన నిర్ణాయకసంఘములను నియమింపవలెనన్న భారతప్రభుత్వ నిర్ణయాన్ని రాష్ట్రప్రభుత్వం ఆమోదించిందని కార్మిక పరిశ్రమలశాఖామంత్రి పత్రికా ప్రతినిధులకు తెలియజేశారు.

24. భారతప్రభుత్వ ఆర్థిక మంత్రిత్వశాఖ "ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ ఆర్డరు" అను పేరుతో ఒక ప్రకటనచేసింది. ఆ ప్రకటనలో బోర్డు నిర్మాణానికి ఆదేశ మివ్వబడింది.

25. సాధారణంగా ఈ రోజులలో కళాకారులు లోనవుతున్న దుస్థితిపట్ల ముఖ్యమంత్రి తమ విచారాన్ని తెలుపుతూ వారికి మెరిట్ సర్టిఫికెట్లు, మెడల్సు, పతకాలు ఇవ్వడానికి బదులుగా నగదురూపంలో బహుమతులివ్వడం మంచిదని అన్నారు.

26. పునర్నిర్మింపబడిన నాగార్జునసాగర్ కంట్రోలు బోర్డు సమావేశమై ప్రాజెక్టు ప్రథమదశకు సంబంధించిన నివేదికను ఆమోదిస్తూ మొత్తం దశకు రూ. 88.18 కోట్ల ఖర్చును తలపెట్టింది.

27. గోదావరినది మిగులునీటిని మద్రాసురాష్ట్రంతో కలిసి పంచుకొనే విషయానికి సూత్రప్రాయంగా ముఖ్యమంత్రి తమ ఆమోదం తెలిపారు. ఈ విషయాన్ని మద్రాసు ముఖ్యమంత్రి పత్రికా విలేఖరులకు తెలియజేశారు.

ఆంధ్రప్రదేశ్, మద్రాసు, కేరళ రాష్ట్రములతోకూడిన దక్షిణ ప్రాంతానికి ఏర్పాటుచేయబడిన పదిమంది సభ్యులుగల మండలసంఘంలో ఆంధ్రప్రదేశ్ తరపున ముఖ్యమంత్రి, ఆర్థిక శాఖామంత్రి, భూమ్యాదాయ శాఖామంత్రి ప్రతినిధులుగావుంటారు.

28. ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫైనాన్స్ కార్పొరేషనుకురాష్ట్ర కార్మిక పరిశ్రమల శాఖామంత్రి ప్రారంభోత్సవము చేశారు.

29. పారిశ్రామిక సహకార సంస్థల సమాఖ్యయొక్క డైరెక్టర్ల బోర్డు సమావేశం రాష్ట్ర వాణిజ్య, పరిశ్రమల, కార్మిక శాఖామంత్రి అధ్యక్షతన జరిగింది. ఆ సమావేశములో ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డువారు వివరించిన రీతిగా అంబర్ చర్ఖాలను తయారుచేయవలెనని నిర్ణయింపబడింది.

30. ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గంలో పదమూడవ మంత్రిగా శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిచేత గవర్నర్ రాజ్‌భవన్‌లో ప్రమాణం చేయించారు.

# భారత దేశమునకు క్రొత్త నాణెములు



**భారతదేశంలో 1957 ఏప్రిల్ 1 వ తేదీనుంచి దశాంశపద్ధతి నాణెములు వాడుకలోకి వస్తాయి. ఈ పద్ధతి ప్రకారం ఏడు విధముల నాణెములు ఉంటాయి. మొదటిది రూపాయి, రెండవది అర్ధరూపాయి, మూడవది పావలా, ఈ మూడింటి తరువాత 10 నయాపైసాల నాణెం, 5 నయాపైసాల నాణెం, 2 నయాపైసాల నాణెం, ఒక నయాపైసా ఉంటాయి. మొదటి మూడు రకముల నాణెముల విలువ ఇప్పుడున్నట్లుగానే వుంటుంది. తరువాతి నాలుగు నాణెములు ప్రస్తుతమున్న చిన్న నాణెముల విలువకు ఏవిధముగా సరిపుచ్చవచ్చునో పరివర్తన పథకంలో చూపబడింది. ప్రస్తుత నాణెములు, కొత్తగా ప్రవేశపెట్టబడు నాణెములు కనీసం మూడేండ్లపాటు వాడుకలో ఉంటాయి.**

మొదట కొత్త నాణెములలో చిన్నవి— అంటే 10 నయాపైసాలు, 5 నయాపైసాలు, 2 నయాపైసాలు, ఒక నయాపైసా నాణెములు ఏప్రిల్ 1 వ తేదీన ప్రవేశపెట్టబడుతాయి. కొంత కాలం తరువాత పెద్ద రకముల నాణెములు— అంటే ఒక రూపాయి, అర్ధరూపాయి, పావలా వాడుకలోకి వస్తాయి.

ఈ దేశంలో బ్రిటిషు పరిపాలన రాకపూర్వం భారత దేశ కరెన్సీ పురాతనమైన ప్రాచ్యసూత్రం ప్రకారంఉండేది. అంటే నాణెం ఎంతవిలువగలదని చెప్పబడుతుందో అంత విలువగల లోహం అందులో వుండాలి. బ్రిటిషు పరిపాలనకు పూర్వం ఈ దేశంలోవున్న టంకసాలలు లోహమును వన్నెచూచి, పరీక్షచేసి, కావలసిన ప్రమాణం ప్రకారం ఆ లోహమును కోసేవి. ఇకదానిమీద ప్రభుత్వ ముద్ర పడిపోవడంతో అందులో స్వచ్ఛమైన లోహం వున్నదనీ, బరువుకూడా సక్రమంగా వుందనీ ధృవపరచినట్లయ్యేది. అంతేకాని నాణెం విలువ విషయంలో ప్రత్యేకించి చెప్పవలసిన పని లేకపొయ్యేది. అప్పుడు కాగితపు కరెన్సీలేదు. కాని కరెన్సీ, నాణెముల విషయంలో ఆధునిక భావాల ఆవిర్భావంతో పాతపద్ధతులు మారిపోయాయి. కొత్త సూత్రాలు అమలులోకి వొచ్చాయి. నాణెమునకు పూర్తి విలువ ఉండాలనే సిద్ధాంతానికి బదులు ఇప్పటి నామ మాత్రపు నాణెములు, కాగితపు కరెన్సీ ప్రవేశపెట్టబడినవి.

ఈస్టిండియా కంపెనీ వ్యాపారం మొదలుపెట్టి తరువాత దేశమును తమ ఆక్రమణక్రిందికి తెచ్చుకుంటున్న కాలంలో ఉత్తర భారతంలో బంగారు నాణెములు, వెండి నాణెములు అమలులో ఉండేవి. బంగారు నాణెములతోపాటు వెండి నాణెములుకూడా వాడుకలో ఉండేవి. కాని వాటి రెండిటి మధ్య నిర్ణీతమైన నిష్పత్తి ఏమీ ఉండేదికాదు. అట్టి నిష్పత్తి ఉండడానికికూడా వీలులేదు. ఎందుచేతనంటే సంస్థానాధీశులు, రాజ్యాధిపతులు, గవర్నర్లు తమ సొంతనాణెములనే చెలామణీ చేసుకుంటూ ఉండేవారు. దక్షిణ భారతంలో ప్రజలు బంగారునాణెములను వాడుకొనేవారు. అంటే విలువ కట్టడానికీ, సరుకును మార్చుకోవడానికీ నాణెములనే ఒక ప్రత్యక్ష సాధనంగా ఉపయోగించుకొనేవారన్న మాట. అప్పుడు విభిన్నమైన బరువు. నాణ్యంగల దాదాపు 994 రకములు నాణెములు వాడుకలో వుండేవని పరిశోధన మూలకంగా తెలుస్తున్నది.

## భారతదేశ టంకసాలలు

ఇప్పుడు వాడుకలో వున్నట్టి భారతదేశరూపాయ మొదట 1835 లో తయారుచేయబడింది. దాని బరువు 180 ట్రాయ్ గ్రెయినులు. నాణ్యం పన్నెండింట పదకొండు వంతులు ఉండేది. ఆధునికమయిన టంకసాల కలకత్తాలో 1824 లో నెలకొల్పబడింది. నాణెములు తయారుచేయుటకై దానిని 1829 ఆగస్టు 1 వ తేదీన ప్రారంభోత్సవం చేయబడింది. ఆ తరువాత బొంబాయిలో మరొక టంకసాల స్థాపించబడింది. ఈ రెండు టంకసాలలు ఒక శతాబ్దానికిపైగా భారతదేశ అవసరాలను తీరుస్తూవొచ్చాయి. మద్రాసులోని

టంకసాలకూడా కొంతకాలం నాణెములనుతయారుచేసింది. 1952 లో కలకత్తా (అలీపూరు)లో పెద్దటంకసాల నెలకొల్పబడింది. అది అంతకుపూర్వం కలకత్తాలోవున్న టంకసాల పనిని చేయడం మొదలుపెట్టింది.

ఇప్పుడు దశాంశపద్ధతి నాణెములను ప్రవేశపెట్టడానికి అందు కవసరమయిన నాణెములను అలీపూరు, బొంబాయి టంకసాలలు, హైదరాబాదులోని చిన్న టంకసాల తయారు చేయాలి. భారతదేశమువంటి పెద్ద జనాభాగల దేశములో దైనందిన వాడకానికి చిన్ననాణెముల అవసరం మరీఎక్కువగా వుంటుందికాబట్టి ఇది ఛాలా పెద్దపని అని చెప్పవలసి వుంటుంది. మన టంకసాలలు, ముఖ్యంగా అలీపూరు, బొంబాయి టంకసాలలు ఇంతటి గొప్పపని చేయడానికి వీలుగా వాటిలో తగు యంత్రసామాగ్రి అమర్చబడింది. ఇవి అప్పుడే కొత్తనాణెములను తయారుచేసేపనిని ప్రారంభించినవి.

నాణెం తయారుచేయడం చాలా కష్టమయినపని. అందులోనూ సాధ్యమయినంతవరకు కచ్చితంగా తయారుచేయవలసివుంటుంది. ప్రతిదశలో పనిని శ్రద్ధగాచూచి ఏ వైనా లోపాలుంటే అట్టి నాణెములను మొదటిదశలోనే తీసివేయవలసివుంటుంది. కొత్తదయిన దశాంశపద్ధతి నాణెములలో ఒక్కొక్కరకాన్ని చక్కగా తయారుచేయాలంటే అనేక సమస్యలు ఎదుర్కొంటాయి. అనేక వారాలు ప్రయోగాలు చేస్తేనేగాని కొత్తనాణెములను సంతృప్తికరంగా తయారుచేయడానికి వీలులేదు.

1957 ఏప్రిల్ 1 వ తేదీ నుంచి ఒక నయాపైసా, 2, 5, 10 నయాపైసా నాణెములు వాడుకలోకి వస్తాయి. వీటితో పాటు ఇదివరకున్నట్టి కానీ, అర్ధణా, అణాబిళ్ళలు కూడా చెలామణీలో వుంటాయి. కొంతకాలం తరువాత ఇప్పటి పావలా, అర్ధరూపాయి, రూపాయి నాణెములకు సరియైన 25, 50, 100 నయాపైసా నాణెములు ప్రవేశపెట్టబడుతాయి. ఈ రెండు విధముల నాణెములు కొంతకాలం పాటు చెలామణి అవుతూ, క్రమేణా పాతవి ఉపసంహరింపబడుతాయి.

తంతి తపాలాశాఖలు కూడా ప్రస్తుతమున్న స్టాంపు బిళ్ళలకు బదులుగా దశాంశ విలువగల కొత్తరకం బిళ్ళలను అమలులోకి తేవడానికి తగు ఏర్పాటుచేస్తున్నవి. ఈ విషయంలో ప్రజల కేమైనా ఇబ్బందికలిగినట్లయితే అట్టిదానిని తొలగించవలసిందిగా తపాలా ఉద్యోగులకు ఉత్తర్వులు చేయబడుతాయి.

ఇక రెవిన్యూ బిళ్ళలు, ఇతర విధములైన స్టాంపుల విషయం, ప్రస్తుతం వాడుకలో వున్న బిళ్ళలు 1957 ఏప్రిలు 1 వ తేదీ తరువాత కూడా కొంతకాలం పాటు వాడుకలో ఉంటాయి. పూర్తిమార్పు బహుశా 1958 ఏప్రిల్ 1 వ తేదీ వరకు సాధ్యంకావచ్చు. ఈ తేదీకి పూర్వమే కేంద్ర, రాష్ట్ర చట్టాలలో అవసరమైన సవరణలు చేయవలసివుంటుంది. కొత్తరకాల బిళ్లలు తమ సంఖ్యలో సిద్ధంగా ఉంచవలసి ఉంటుంది.

## రైల్వేలు

1957 ఏప్రిల్ 1 వ తేదీ నుంచి ప్రయాణీకుల చార్జీల ఆధారాలను కొత్తనాణెం ప్రకారం మార్చడానికి రైల్వే మంత్రిత్వ శాఖ నిర్ణయించింది. అయితే సరుకులరేట్ల ఆధారాలు మాత్రం 1957 ఏప్రిల్ 1 వ తేదీ తరువాత కూడా కొంతకాలం పాటు ప్రస్తుత నాణెములోనే ఉండగలవని ఆశించబడుతున్నది. రైల్వే సరుకుల రేట్ల వ్యవస్థ విచారణసంఘం వారి సూచనల ననుసరించి సరుకుల రవాణారేట్ల వ్యవస్థను పునః పరిశీలించే సందర్భంలో పైన పేర్కొనబడిన ఆధారాలను కొత్త నాణెములకు మార్పుచేయడం జరుగుతుంది.

## ఇతరదేశాలలో

దశాంశపద్ధతి నాణెమును ప్రవేశపెట్టి భారతదేశం కరెన్సీ విషయంలో గొప్ప సంస్కరణను జరిపిందని చెప్పాలి. సొంతనాణెములుగల దేశాలు 140 వున్నవి. వీనిలో 105 దేశాలు దశాంశపద్ధతిని అమలుజరిపినవి. ఎన్సైక్లోపీడియా బ్రిటానికా (బ్రిటిషు విజ్ఞానసర్వస్వము) లో చెప్పబడిన దానినిబట్టి మొట్టమొదట అమెరికా సంయుక్తరాష్ట్రాలు (1786 మరియు 1792 లో) డాలర్‌ను యూనిటుగా పెట్టుకొని దశాంశపద్ధతినాణెమును ప్రవేశపెట్టినవి. ఆ తరువాత ఫ్రాన్సు (1799 మరియు 1803) ఈ పద్ధతిని అవలంబించింది. తరువాత లాటిన్‌యూనియన్ (1865), జర్మనీ (1873). స్కాండినేవియన్ రాష్ట్రాలు (1875), ఆస్ట్రియా, హంగరీ (1870–1872 లో అభివృద్ధి పరచబడింది), రష్యా (1839 మరియు 1897) ఈ పద్ధతి నాణెములను ప్రవేశపెట్టినవి.

ఇంగ్లండులో దశాంశపద్ధతి నాణెమువల్ల గలిగేసౌకర్యం సర్వత్రా అంగీకరింపబడింది. కాని కొన్ని ఆచరణసంబంధమైన ఇబ్బందులవల్ల, ముఖ్యంగా దేశవ్యాప్తంగా ఆటోమాటిక్‌కౌంటింగ్‌మిషనులు ఉపయోగింపబడుతూ ఉండడం

వల్ల అచ్చట దశాంశపద్ధతినాణెం అమలులోకిరాలేదు. ముఖ్యముగా ఇంగ్లండుదేశం పొందిన అనుభవమును గ్రహించి ఐనా భారతదేశంలో కరెన్సీసంస్కరణను ప్రవేశపెట్టవలసిన ఆవశ్యకత వ్యక్తం కాగలదు. భారతదేశం పారిశ్రామికంగా ఒక క్రొత్తదశలోకి ప్రవేశించబోతున్నది. వచ్చే పదిహేనేండ్లలో వందలకొలది కాల్క్యులేటింగ్ మిషనుల ఉపయోగం అవసరమవుతుంది. ఇంతవరకు మనదేశంలో ఆటోమాటిక్ రికార్డింగ్ మిషనులు, కాయిన్ ఆపరేటెడ్ స్లాట్‌మిషనులు చాలా తక్కువగా వున్నవి. పైగా కొలతకు సంబంధించిన శాస్త్రీయ పరికరములను తయారుచేసే పరిశ్రమలు ఇంకా శైశవదశలో వున్నవి. కనుక దశాంశపద్ధతి నాణెములను ప్రవేశపెట్టకుండా ఇంకా కొంతకాలంవరకు ఈ సంస్కరణను వాయిదావేసినట్లయితే అప్పటికల్లా అనేక యంత్రములు, పరికరములు ప్రస్తుత మున్నట్టి తూకములకు అనుగుణంగా తయారుచేయబడి తరువాత వాటికి బదులుగా క్రొత్తవాటిని ప్రవేశపెట్టడం సాధ్యంకాజాలదు.

## ప్రస్తుతపు నాణెములతోగల సంబంధము

క్రొత్త నాణెములపై యూనిట్లలో ప్రస్తుతపు 2-అణా, 1-అణా, అర్ధణా, ఒక పైస నాణెములకు సరిగ్గా సమతుల్యమయిన నాణెములు వుండవు; వాటిస్థానాలలో వరుసగా 10 నయాపైసాలు, 5 నయాపైసాలు, 2 నయాపైసాలు, 1 నయాపైసా వుండగలవు.

ప్రస్తుతపు పావలా, అర్ధరూపాయ, ఒకరూపాయ నాణెములు ప్రస్తుతపు నాణెములపద్ధతి, క్రొత్తనాణెముల పద్ధతి యీ రెండింటిలోనుకూడా మామూలుగా వుండగలవు. ఈవిధంగా :

| | | | | |
|---|---|---|---|---|
| 25 | నయాపైసాలు | 4 | అణాలకు | సమానము |
| 50 | ,, ,, | 8 | ,, | ,, |
| 100 | ,, ,, | 1 | రూపాయకు | ,, |

ప్రతి క్రొత్తనాణెమునకు రూపాయతోగల సంబంధమును ప్రజలు సరిగ్గా అర్థంచేసుకొనడానికి వీలుగా అట్టి నాణెములు యెన్ని అయితే ఒకరూపాయ అవుతుందో ఆ విషయాన్ని ఆ యా నాణెములమీదే సూచించాలని నిశ్చయించబడినది.

ఈనాణెముల స్వరూప స్వభావాలు దిగువ విధంగా వుండగలవు :

నయా పైసా (సరియైన ప్రమాణం)

బొమ్మవైపు అడుగువైపు







| | |
|---|---|
| లోహము | కంచు |
| ఆకారము | గుండ్రము |
| వ్యాసము | 16 మిల్లి మీటర్లు |
| బరువు | 1.5 గ్రాములు |

2 నయా పైసాలు

బొమ్మవైపు అడుగువైపు







| | |
|---|---|
| లోహము | రాగి మిశ్రమమైన నికెల్ |
| ఆకారము | 8 వంకీలు |
| వ్యాసము | 18 మి. మీ. |
| బరువు | .... 3 గ్రాములు |
| పూజలు | .... 56 |

5 నయా పైసాలు

బొమ్మవైపు .... అడుగువైపు







| | |
|---|---|
| లోహము | .... రాగి మిశ్రమమైన నికెల్ |
| ఆకారము | .... గుండ్రటి అంచులుగల చదరము |
| వ్యాసము | .... 22 మి. మీ. |
| బరువు | .... 4 గ్రాములు |
| పూజలు | .... 44 |

10 నయా పైసాలు

బొమ్మవైపు .... అడుగువైపు






లోహము .... రాగి మిశ్రమమైననికెల్
ఆకారము .... 8 వంకీలు
వ్యాసము .... 23 మి. మీ.
బరువు .... 5 గ్రాములు
పూజలు ... 56

25 నయా పైసాలు

బొమ్మవైపు ... అడుగువైపు






లోహము .... స్వచ్ఛమైన నికెల్
ఆకారము ... గుండ్రము
వ్యాసము .... 19 మి. మీ.
బరువు .... 25 గ్రాములు
పూజలు .... 50
కోతగీతలు .... 100

50 నయా పైసాలు

బొమ్మవైపు ... అడుగువైపు






లోహము .... స్వచ్ఛమైన నికెల్
ఆకారము .... గుండ్రము
వ్యాసము .... 24 మి. మీ.
బరువు .... 5 గ్రాములు
పూజలు .... 50
కోతగీతలు .... 150

1 రూపాయ (100 నయా పైసాలు)

బొమ్మవైపు అడుగువైపు






లోహము .... స్వచ్ఛమైన నికెల్
ఆకారము .... గుండ్రము
వ్యాసము .... 28 మి. మీ.
బరువు .... 10 గ్రాములు
పూజలు .... 50
కోతగీతలు .... 200

క్రొత్త నాణెము లన్నిటిమీద బొమ్మవైపున అశోక స్తంభపు సింహాల డిజైనువుంటుంది. హిందీలో "భారత్"అనీ, ఇంగ్లీషులో "ఇండియా" అని ఆ నాణెములపై వ్రాయబడి వుంటుంది.

క్రొత్త నాణెము లన్నిటిలోను అడుగువైపున అవి చెలామణీకి తేబడిన సంవత్సరము, నయాపైసలలో వాటి విలువ నిర్దేశించబడివుంటుంది. ఇందుకు అంతర్జాతీయమైన అంకెలు వాడబడతాయి.

100-నయా పైసాలు, 50-నయా పైసాలు, 25-నయా పైసాలు స్వచ్ఛమైన నికెల్‌తో తయారుచేయబడతాయి. 10, 5, 2 నయాపైసాల నాణెములు రాగి మిశ్రమమైన నికెల్‌తో (75 శాతం రాగి, 25 శాతం నికెల్)తయారుచేయబడతాయి. ఒక నయా పైసా నాణెము ఒకరకం కంచుతో తయారు చేయబడుతుంది.

ఈ క్రొత్తనాణెములు చలామణీకై రిజర్వుబ్యాంకి, స్టేట్ బ్యాంకి కార్యాలయాలు, ట్రెజరీలు, సబ్-ట్రెజరీల ద్వారా ప్రజలకు అందచేయబడతాయి. వాటి వాడకానికి ప్రజలు అలవాటుపడి, వాటి చలామణీ తగినంత హెచ్చిన తరువాత ప్రస్తుతపు నాణెములు చలామణీ నుండి తొలగించబడతాయి. ఇందుకు అధమపక్షం మూడు సంవత్సరాలు పడుతుందని భావించబడుతున్నది.

## పరివర్తన పట్టికలు

వర్తక వ్యాపారాల ప్రయోజనాల నిమిత్తం ప్రస్తుతపు నాణెముల విలువను నయాపైసాలలో వివరించే పరివర్తన పట్టికలు విస్తారంగా పంచిపెట్టబడతాయి.

క్రయ విక్రయాల సందర్భంలో ప్రస్తుతపు నాణెములలో డబ్బు యివ్వదలచుకున్నప్పుడు మారకపు విలువను ఒక పద్ధతి ప్రకారం నిర్ణయించవలసివున్నది. ఈ పద్ధతి 1955 సవరణ చట్టంచే ప్రవేశపెట్టబడిన 1906 భారతీయ నాణెముల చట్టపు 14 (2) సెక్షన్‌లో నిర్దేశించబడింది. అనుబంధంలో యివ్వబడిన రెండు పట్టికలలో క్రొత్త నాణెములకు బదులు యివ్వబడే ప్రస్తుతపు నాణెములు యే రేటులో తీసుకొనబడతాయో వివరించబడింది. ( I. II పట్టికలు )

మారకం విషయంలో కొంత చిక్కు కలగవచ్చును. ఉదాహరణకు : ఒకరు 2 నయాపైసాల సరుకు కొనదలచారనుకుందాము. పరివర్తన పట్టిక (పట్టిక I) లో దీనికి సమతుల్యమైన విలువలు రెండు వుంటాయి. అనగా ప్రస్తుతపు నాణెములలో (1) 3 పైసలు (2) 4 పైసలు. 100 నయా పైసాలకి 192 పైసల చొప్పున చూస్తే 4 పైసల విలువ దగ్గరగా సమతుల్యంగా వుంటుంది. కాని కొనే వ్యక్తిని 4 పైసలు చెల్లించమని నిర్బంధించడానికి వీలులేదు. చట్టం 14 (2) సెక్షన్‌లో నిర్ణయించబడిన మారకం పద్ధతిప్రకారం 3 పైసలు 2 నయా పైసాలకి సమానమవుతాయి. అందుచేత అమ్మకందారుడు 3 పైసలు తీసుకుని సంతృప్తిచెందాలి. ఈ విధంగా ముఖ్యంగా ప్రారంభదశలో కొంతనష్టంవుంటుంది. కాని కొత్తనాణెములు అధికంగా చలామణీలోనికి వచ్చి, ప్రస్తుతపు నాణెములు వుపసంహరింపబడిన కొలదీ ఈ నష్టం తగ్గగలదని ఆశించబడుతున్నది. అదీకాక యీ మారకం పద్ధతి రొక్కం యిచ్చిన సందర్భాలలోనే వర్తిస్తుంది. ఇందువల్ల లాభం పొందడానికై ఒకవ్యక్తి పైస తరువాత పైసను లేక తక్కువ విలువ గల యితర నాణెములను అదేపనిగా యిస్తూవుండడు. ఎక్కువ మొత్తాలను యిచ్చినకొలదీ నష్టం శాతం క్రమేణా తగ్గుతుంది. ఏమైనా కొత్తనాణెములు అధికంగా చలామణీలోనికి వచ్చి, ప్రస్తుతపు నాణెములు వుపసంహరింపబడినప్పుడు నష్టం యేమీ వుండదనే చెప్పవచ్చును.

## సమతుల్యాల సులభ వివరణ పట్టిక

పట్టిక II లో సమతుల్యాలు సులభమైన పద్ధతిలో చూపబడినవి. ఆచరణ ప్రయోజనాలకు యిది చాలు. చిల్లర పైసలకి సంబంధించిన విలువలు యిందులో పేర్కొనబడలేదు. వ్యవహార రీత్యా యివ్వడానికి పైస నాణెములు అందుబాటులో లేకపోవడమే యిందుకు కారణం. 1957 ఏప్రిల్ 1 వ తేదీనాటికి పుస్తకాలలో వున్న నిలవలను మార్చడానికే పెద్ద పరివర్తన పట్టిక ప్రధానంగా వినియోగించబడుతుంది. వ్యవహారం జరిగేటప్పుడు నాణెములు యివ్వబడినప్పుడే పరివర్తన పట్టికలు వుపయోగించబడాలి. ఒకరేటు మొత్తం విలువను లెక్కకట్టడం వంటి యితర సందర్భాలలో, ఆ రెంటికి సరియయిన సమతుల్యాన్ని లెక్కకట్టాలి. ఈ సందర్భంలో భిన్నాలు వచ్చినా కూడా అలాచేయవలసినదే. డబ్బు చెల్లించే ప్రశ్న వుదయించినప్పుడు మొత్తం సొమ్ములో చిల్లరను నయా పైసాలలోకి మార్చి చెల్లించాలి. ఈ మార్పు పరివర్తన పట్టిక ననుసరించి చేయబడాలి. ఇలా చెల్లించే విధానం దిగువ వివరింపబడింది.

ఒక పెన్సిలు ఖరీదు $1\frac{1}{2}$ అణాలు అనీ, ఒక వ్యక్తి ఒక డజను పెన్సిళ్లు కొనుక్కోదలచాడనీ అనుకుందాము. అతని వద్ద నయాపైసాలే వున్నాయనుకుందాము. అప్పుడు మొత్తం ఖరీదును లెక్కకట్టడానికై పరివర్తన పట్టికలో నయా పైసాలలో $1\frac{1}{2}$ అణాలకి సమతుల్యాన్ని చూసి, దాన్ని 12 పెట్టి గుణించకూడదు. $1\frac{1}{2}$ అణాలకి సరియైన సమతుల్యాన్ని అనగా 9.375 నయా పైసాలను తీసుకొని వాటిని 12 పెట్టి గుణించాలి. లేదా డజను పెన్సిళ్ల ఖరీదును ప్రస్తుతపు నాణెములలో లెక్కకట్టి, అలా వచ్చిన మొత్తంలో చిల్లరను, పరివర్తన పట్టిక ననుసరించి నయాపైసాలలోకి మార్చాలి. ఈ వుదాహరణలో మొత్తం ఖరీదు 18 అణాలు (అనగా 1 రూపాయ 2 అణాలు) అందుచేత 2 అణాలకి యెన్ని నయా పైసాలో పట్టికలో చూడాలి. 2 అ. లకి 12 నయాపైసాలు. కాబట్టి కొన్న వ్యక్తి 1 రూపాయ 12 నయా పైసాలను చెల్లించాలి.

ఒకవేళ యెప్పుడైనా 12 పెన్సిళ్లు, 6 కాఫీ పుస్తకాలు, 4 రూళ్ల కర్రలు ప్రస్తుతపు నాణెములలోని రేటు ప్రకారం కొనడం జరిగితే, ప్రస్తుతపు నాణెములలోని రేట్ల ప్రకారమే బిల్లులోని మొత్తం సొమ్మును లెక్కకట్టాలి. మొత్తం సొమ్ములో అణా, పైసలుగా వున్న చిల్లరను నయా పైసాలలోకి పరివర్తన పట్టిక ననుసరించి మార్చి, అప్పుడు నయా పైసాలలో సొమ్ము చెల్లించాలి.

అలాకాక ఒకవేళ ధరలు నయా పైసాలలో ప్రకటింపబడివుండవచ్చును. ఒకవ్యక్తి వద్ద అణాలు, పైసలుమాత్రమే వుండవచ్చును. అప్పుడు ఆ వ్యవహారంలో మొత్తం సొమ్మును మొదట నయా పైసాలలో లెక్కకట్టాలి, ఆతరువాత మొత్తం సొమ్ములో చిల్లరగావున్న నయా పైసాలకి ప్రస్తుతపు నాణెములలో సమతుల్యాలేమిటో పరివర్తనపట్టికలో చూడాలి, ఉదాహరణకి కొన్నవస్తువులమొత్తం ఖరీదు

8 రూపాయల 20 నయా పైసాలనుకుందాము. రూపాయ విలువ రెండు పద్ధతులలోను ఒకటేకాబట్టి రూ. 8 లను చెల్లించడంలో కష్టమేమీలేదు. పోతే పై 20 నయా పైసాల విషయం. పరివర్తనపట్టికను చూస్తే 3 అణాలు 19 నయా పైసాలకి సమానమని బోధపడుతుంది. ప్రస్తుతపు నాణెములలో 3 అణాలను యిస్తే 20 నయాపైసాలకి యింకా ఒక నయాపైసా బాకీవుంటుంది. దానికివుంటే ఒక నయాపైసాను యివ్వవచ్చును లేదా ఒక దమ్మిడీ అయినా యివ్వవచ్చును.

## పట్టిక - 1

### ప్రస్తుత నాణెములను దశాంశ నాణెములోనికి మార్చుకొనుటకు పరివర్తన పథకం

లావాదేవీ సందర్భంలో నిర్దిష్ట విలువగల ప్రస్తుత నాణెములను ప్రత్యక్షంగా ఇచ్చునపుడు మాత్రమే ఈ పట్టికను ఉపయోగించవలెను.

ఏదేని లావాదేవీ సందర్భంలో ప్రత్యక్షంగా నాణెం ఇచ్చే సందర్భంగాక ఇతర సందర్భాలలో ప్రస్తుతనాణెపు విలువను లేక క్రొత్తనాణెపు విలువను ఇతర నాణెములోకి మార్చుకోవలసిన సందర్భంలో ఒక రూపాయకు లేక 16 అణాలకు లేక 64 కానులకు లేక 192 పైసలకు 100 నయా పైసాల చొప్పున కచ్చితమైన సమానమొత్తమును తేల్చుకోవలెను.

| | | | |
|---|---|---|---|
| 1 | పైసా | — | 1 నయా పైసా |
| 2 | పైసలు | — | 1 నయా పైసా |
| 3 | ,, | — | 2 నయాపైసాలు |
| 4 | ,, | — | 2 ,, ,, |
| 5 | ,, | — | 3 ,, ,, |
| 6 | ,, | — | 3 ,, ,, |
| 7 | ,, | — | 4 ,, ,, |
| 8 | ,, | — | 4 ,, ,, |
| 9 | ,, | — | 5 ,, ,, |
| 10 | ,, | — | 5 ,, ,, |
| 11 | ,, | — | 6 ,, ,, |
| 1 | అణా | — | 6 ,, ,, |
| 1 | ,, 1 పైసా | — | 7 ,, ,, |
| 1 | ,, 2 పైసలు | — | 7 ,, ,, |
| 1 | ,, 3 ,, | — | 8 ,, ,, |
| 1 | ,, 4 ,, | — | 8 ,, ,, |
| 1 | ,, 5 ,, | — | 9 ,, ,, |
| 1 | ,, 6 ,, | — | 9 ,, ,, |
| 1 | అణా 7 పైసలు | — | 10 నయాపైసాలు |
| 1 | ,, 8 ,, | — | 10 ,, ,, |
| 1 | ,, 9 ,, | — | 11 ,, ,, |
| 1 | ,, 10 ,, | — | 11 ,, ,, |
| 1 | ,, 11 ,, | — | 12 ,, ,, |
| 2 | అణాలు | — | 12 ,, ,, |
| 2 | అణాల 1 పైసా | — | 13 ,, ,, |
| 2 | ,, 2 పైసలు | — | 14 ,, ,, |
| 2 | ,, 3 ,, | — | 14 ,, ,, |
| 2 | ,, 4 ,, | — | 15 ,, ,, |
| 2 | ,, 5 ,, | — | 15 ,, ,, |
| 2 | ,, 6 ,, | — | 16 ,, ,, |
| 2 | ,, 7 ,, | — | 16 ,, ,, |
| 2 | ,, 8 ,, | — | 17 ,, ,, |
| 2 | ,, 9 ,, | — | 17 ,, ,, |
| 2 | ,, 10 ,, | — | 18 ,, ,, |
| 2 | ,, 11 ,, | — | 18 ,, ,, |
| 3 | అణాలు | — | 19 ,, ,, |
| 3 | అణాల 1 పైసా | — | 19 ,, ,, |
| 3 | ,, 2 పైసలు | — | 20 ,, ,, |
| 3 | ,, 3 ,, | — | 20 ,, ,, |
| 3 | ,, 4 ,, | — | 21 ,, ,, |
| 3 | ,, 5 ,, | — | 21 ,, ,, |
| 3 | ,, 6 ,, | — | 22 ,, ,, |
| 3 | ,, 7 ,, | — | 22 ,, ,, |
| 3 | ,, 8 ,, | — | 23 ,, ,, |
| 3 | ,, 9 ,, | — | 23 ,, ,, |
| 3 | ,, 10 ,, | — | 24 ,, ,, |
| 3 | ,, 11 ,, | — | 24 ,, ,, |
| 4 | అణాలు | — | 25 ,, ,, |
| 4 | అణాల 1 పైసా | — | 26 ,, ,, |
| 4 | ,, 2 పైసలు | — | 26 ,, ,, |
| 4 | ,, 3 ,, | — | 27 ,, ,, |
| 4 | ,, 4 ,, | — | 27 ,, ,, |
| 4 | ,, 5 ,, | — | 28 ,, ,, |
| 4 | ,, 6 ,, | — | 28 ,, ,, |
| 4 | ,, 7 ,, | — | 29 ,, ,, |
| 4 | ,, 8 ,, | — | 29 ,, ,, |
| 4 | ,, 9 ,, | — | 30 ,, ,, |
| 4 | ,, 10 ,, | — | 30 ,, ,, |
| 4 | ,, 11 ,, | — | 31 ,, ,, |
| 5 | అణాలు | — | 31 ,, ,, |
| 5 | అణాల 1 పైసా | — | 32 ,, ,, |
| 5 | ,, 2 పైసలు | — | 32 ,, ,, |
| 5 | ,, 3 ,, | — | 33 ,, ,, |

| | | | | |
|---|---|---|---|---|
| 5 | అణాల 4 పైసలు | — | 33 | నయాపైసలు |
| 5 | ,, 5 ,, | — | 34 | ,, ,, |
| 5 | ,, 6 ,, | — | 34 | ,, ,, |
| 5 | ,, 7 ,, | — | 35 | ,, ,, |
| 5 | ,, 8 ,, | — | 35 | ,, ,, |
| 5 | ,, 9 ,, | — | 36 | ,, ,, |
| 5 | ,, 10 ,, | — | 36 | ,, ,, |
| 5 | ,, 11 ,, | — | 37 | ,, ,, |
| 6 | అణాలు | — | 37 | ,, ,, |
| 6 | అణాల 1 పైసా | — | 38 | ,, ,, |
| 6 | ,, 2 పైసలు | — | 39 | ,, ,, |
| 6 | ,, 3 ,, | — | 39 | ,, ,, |
| 6 | ,, 4 ,, | — | 40 | ,, ,, |
| 6 | ,, 5 ,, | — | 40 | ,, ,, |
| 6 | ,, 6 ,, | — | 41 | ,, ,, |
| 6 | ,, 7 ,, | — | 41 | ,, ,, |
| 6 | ,, 8 ,, | — | 42 | ,, ,, |
| 6 | ,, 9 ,, | — | 42 | ,, ,, |
| 6 | ,, 10 ,, | — | 43 | ,, ,, |
| 6 | ,, 11 ,, | — | 43 | ,, ,, |
| 7 | అణాలు | — | 44 | ,, ,, |
| 7 | ఋణాల 1 పైసా | — | 44 | ,, ,, |
| 7 | ,, 2 పైసలు | — | 45 | ,, ,, |
| 7 | ,, 3 ,, | — | 45 | ,, ,, |
| 7 | ,, 4 ,, | — | 46 | ,, ,, |
| 7 | ,, 5 ,, | — | 46 | ,, ,, |
| 7 | ,, 6 ,, | — | 47 | ,, ,, |
| 7 | ,, 7 ,, | — | 47 | ,, ,, |
| 7 | ,, 8 ,, | — | 48 | ,, ,, |
| 7 | ,, 9 ,, | — | 48 | ,, ,, |
| 7 | ,, 10 ,, | — | 49 | ,, ,, |
| 7 | ,, 11 ,, | — | 49 | ,, ,, |
| 8 | అణాలు | — | 50 | ,, ,, |
| 8 | అణాల 1 పైసా | — | 51 | ,, ,, |
| 8 | ,, 2 పైసలు | — | 51 | ,, ,, |
| 8 | ,, 3 ,, | — | 52 | ,, ,, |
| 8 | ,, 4 ,, | — | 52 | ,, ,, |
| 8 | ,, 5 ,, | — | 53 | ,, ,, |
| 8 | ,, 6 ,, | — | 53 | ,, ,, |
| 8 | ,, 7 ,, | — | 54 | ,, ,, |
| 8 | ,, 8 ,, | — | 54 | ,, ,, |
| 8 | ,, 9 ,, | — | 55 | ,, ,, |
| 8 | ,, 10 ,, | — | 55 | ,, ,, |
| 8 | ,, 11 ,, | — | 56 | ,, ,, |
| 9 | అణాలు | — | 56 | ,, ,, |

| | | | | |
|---|---|---|---|---|
| 9 | అణాల 1 పైసా | — | 57 | నయాపైసాలు |
| 9 | ,, 2 పైసలు | — | 57 | ,, ,, |
| 9 | ,, 3 ,, | — | 58 | ,, ,, |
| 9 | ,, 4 ,, | — | 58 | ,, ,, |
| 9 | ,, 5 ,, | — | 59 | ,, ,, |
| 9 | ,, 6 ,, | — | 59 | ,, ,, |
| 9 | ,, 7 ,, | — | 60 | ,, ,, |
| 9 | ,, 8 ,, | — | 60 | ,, ,, |
| 9 | ,, 9 ,, | — | 61 | ,, ,, |
| 9 | ,, 10 ,, | — | 61 | ,, ,, |
| 9 | ,, 11 ,, | — | 62 | ,, ,, |
| 10 | అణాలు | — | 62 | ,, ,, |
| 10 | అణాల 1 పైసా | — | 63 | ,, ,, |
| 10 | ,, 2 పైసలు | — | 64 | ,, ,, |
| 10 | ,, 3 ,, | — | 64 | ,, ,, |
| 10 | ,, 4 ,, | — | 65 | ,, ,, |
| 10 | ,, 5 ,, | — | 65 | ,, ,, |
| 10 | ,, 6 ,, | — | 66 | ,, ,, |
| 10 | ,, 7 ,, | — | 66 | ,, ,, |
| 10 | ,, 8 ,, | — | 67 | ,, ,, |
| 10 | ,, 9 ,, | — | 67 | ,, ,, |
| 10 | ,, 10 ,, | — | 68 | ,, ,, |
| 10 | ,, 11 ,, | — | 68 | ,, ,, |
| 11 | అణాలు | — | 69 | ,, ,, |
| 11 | అణాల 1 పైసా | — | 69 | ,, ,, |
| 11 | ,, 2 పైసలు | — | 70 | ,, ,, |
| 11 | ,, 3 ,, | — | 70 | ,, ,, |
| 11 | ,, 4 ,, | — | 71 | ,, ,, |
| 11 | ,, 5 ,, | — | 71 | ,, ,, |
| 11 | ,, 6 ,, | — | 72 | ,, ,, |
| 11 | ,, 7 ,, | — | 72 | ,, ,, |
| 11 | ,, 8 ,, | — | 73 | ,, ,, |
| 11 | ,, 9 ,, | — | 73 | ,, ,, |
| 11 | ,, 10 ,, | — | 74 | ,, ,, |
| 11 | ,, 11 ,, | — | 74 | ,, ,, |
| 12 | అణాలు | — | 75 | ,, ,, |
| 12 | అణాల 1 పైసా | — | 76 | ,, ,, |
| 12 | ,, 2 పైసలు | — | 76 | ,, ,, |
| 12 | ,, 3 ,, | — | 77 | ,, ,, |
| 12 | ,, 4 ,, | — | 77 | ,, ,, |
| 12 | ,, 5 ,, | — | 78 | ,, ,, |
| 12 | ,, 6 ,, | — | 78 | ,, ,, |
| 12 | ,, 7 ,, | — | 79 | ,, ,, |
| 12 | ,, 8 ,, | — | 79 | ,, ,, |
| 12 | ,, 9 ,, | — | 80 | ,, ,, |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 12 | అణాల 10 పైసలు | — | 80 | నయాపైసాలు | |
| 12 | 11 ,, | — | 81 | ,, | ,, |
| 13 | అణాలు | — | 81 | ,, | ,, |
| 13 | అణాల 1 పైసా | — | 82 | ,, | ,, |
| 13 | ,, 2 పైసలు | — | 82 | ,, | ,, |
| 13 | ,, 3 ,, | — | 83 | ,, | ,, |
| 13 | ,, 4 ,, | — | 83 | ,, | ,, |
| 13 | ,, 5 ,, | — | 84 | ,, | ,, |
| 13 | ,, 6 ,, | — | 84 | ,, | ,, |
| 13 | ,, 7 ,, | — | 85 | ,, | ,, |
| 13 | ,, 8 ,, | — | 85 | ,, | ,, |
| 13 | ,, 9 ,, | — | 86 | ,, | ,, |
| 13 | ,, 10 ,, | — | 86 | ,, | ,, |
| 13 | ,, 11 ,, | — | 87 | ,, | ,, |
| 14 | అణాలు | — | 87 | ,, | ,, |
| 14 | అణాల 1 పైసా | — | 88 | ,, | ,, |
| 14 | ,, 2 పైసలు | — | 89 | ,, | ,, |
| 14 | ,, 3 ,, | — | 89 | ,, | ,, |
| 14 | ,, 4 ,, | — | 90 | ,, | ,, |
| 14 | ,, 5 ,, | — | 90 | ,, | ,, |
| 14 | ,, 6 ,, | — | 91 | ,, | ,, |
| 14 | ,, 7 ,, | — | 91 | ,, | ,, |
| 14 | ,, 8 ,, | — | 92 | ,, | ,, |
| 14 | ,, 9 ,, | — | 92 | ,, | ,, |
| 14 | ,, 10 ,, | — | 93 | ,, | ,, |
| 14 | ,, 11 ,, | — | 93 | ,, | ,, |
| 15 | అణాలు | — | 94 | ,, | ,, |
| 15 | అణాల 1 పైసా | — | 94 | ,, | ,, |
| 15 | ,, 2 పైసలు | — | 95 | ,, | ,, |
| 15 | ,, 3 ,, | — | 95 | ,, | ,, |
| 15 | ,, 4 ,, | — | 96 | ,, | ,, |
| 15 | ,, 5 ,, | — | 96 | ,, | ,, |
| 15 | ,, 6 ,, | — | 97 | ,, | ,, |
| 15 | ,, 7 ,, | — | 97 | ,, | ,, |
| 15 | ,, 8 ,, | — | 98 | ,, | ,, |
| 15 | ,, 9 ,, | — | 98 | ,, | ,, |
| 15 | ,, 10 ,, | — | 99 | ,, | ,, |
| 15 | ,, 11 ,, | — | 99 | ,, | ,, |
| 1 | రూపాయి | — | 100 | ,, | ,, |

## 2 వ పట్టిక

### ప్రస్తుత నాణెముల దశాంశ నాణెములలోనికి మార్చుటకు సంక్షిప్త పరివర్తన పథకం

లావాదేవీ సందర్భంలో నిర్దిష్ట విలువగల ప్రస్తుతనాణెములను ప్రత్యక్షంగా ఇచ్చునపుడు మాత్రమే యీ పట్టికను ఉపయోగించవలెను. ప్రస్తుత నాణెములనుగానీ క్రొత్త నాణెములనుగానీ ఇతర నాణెములోకి మార్చవలసివచ్చినపుడు లావాదేవీలో ప్రత్యక్షంగా నాణెములు ఇచ్చు సందర్భములలో మినహా ఇతర సందర్భములలో అందుకు సమానమయిన విలువగల నాణెములను 100 నయా పైసాలకు ఒక రూపాయ లేక 16 అణాలు లేక 64 కానులు లేక 192 పైసల రేటు చొప్పున లెక్కకట్టవలెను.

| అణాలు | పైసలు | 0 | 4 | 6 | 9 |
|---|---|---|---|---|---|
| 0 | | — | 2 | 3 | 5 |
| 1 | | 6 | 8 | 9 | 11 |
| 2 | | 12 | 14 | 16 | 17 |
| 3 | | 19 | 20 | 22 | 23 |
| 4 | | 25 | 27 | 28 | 30 |
| 5 | | 31 | 33 | 34 | 36 |
| 6 | | 37 | 39 | 41 | 42 |
| 7 | | 44 | 45 | ·47 | 48 |
| 8 | | 50 | 52 | 53 | 55 |
| 9 | | 56 | 58 | 59 | 61 |
| 10 | | 62 | 64 | 66 | 67 |
| 11 | | 69 | 70 | 72 | 73 |
| 12 | | 75 | 77 | 78 | 80 |
| 13 | | 81 | 83 | 84 | 86 |
| 14 | | 87 | 89 | 91 | 92 |
| 15 | | 94 | 95 | 97 | 98 |
| 16 | | 100 | .... | .... | .... |

ఈ క్రింది ఉదాహరణలో సంక్షిప్త పరివర్తన పథకాన్ని ఉపయోగించుకొనే పద్ధతి తెలుపబడింది.

5 అణాల 6 పైసలకు సమానమయిన నయా పైసలు కావలెననుకోండి. ఎడమవైపు "అణాలు" అని వ్రాయబడిన గడిలో 5 నుంచి అడ్డంగావున్న గడినిచూడండి. ఆ తరువాత పై భాగంలో 'పైసలు' అని వ్రాయబడిన గడి క్రింద 6 నుంచి నిడివిగా క్రిందికిచూడండి. ఈ గళ్ళు 34 అను అంకెవద్ద కలుస్తాయి. నయా పైసలో 34 సంఖ్య 5 అణాల 6 పైసలకి సమానమయినది.

పై సంక్షిప్త పరివర్తనపథకాన్ని చూచునపుడు "అణాలు" గడి బాణంగుర్తుతో చూపబడినట్లుగా పట్టిక ఎడమభాగంలో 1 నుంచి 16 వరకుగల సంఖ్య నిడివిగా క్రిందికి పోతుందని గమనించవలెను. "పైసలు" గడి బాణంగుర్తుతో చూపబడినట్లుగా పైన అడ్డంగా పోతుంది. అణాలకు పైసలకు

[తరువాయి 42వ పేజీలో]

# స్త్రీల పొదుపు ఉద్యమం



## ద్వితీయ ప్రణాళికక్రింద విశాల ప్రాతిపదికపై తీవ్రతర కృషి

ప్రణాళికాబద్ధమైన ఆర్థికవ్యవస్థలో తాము వహించవలసిన పాత్రయొక్క ప్రాధాన్యమేమిటో ఈ దేశప్రజలు క్రమేణా తెలుసుకుంటున్నారు. ప్రజాస్వామికదేశంలో ప్రణాళికా బద్ధమైన ఆర్థికవ్యవస్థ అంటే దేనికది విడిగా ఉండిపోయి ప్రజలు చొరవతీసుకోకుండా ఉండడంకాదు. ప్రభుత్వమూ ప్రజలూ గ్రామపంచాయతీదశ మొదలుకొని దేశాభివృద్ధికి చెందిన అన్నిదశల్లోనూ పరస్పరసహకారంతో సమన్వయంతో అభివృద్ధికార్యకలాపాలను జరుపుకోవడమే ఈ ఆర్థికవ్యవస్థ ముఖ్యోద్దేశం. ప్రజలు అప్పుడే రెండవ పంచవర్షప్రణాళికపట్ల ఆసక్తిచూపుతున్నారు. ఆ ప్రణాళిక సామ్యవాదపద్ధతి సమాజం అనే సూత్రం ప్రాతిపదికగాగల శ్రేయోరాజ్యనిర్మాణంకోసం భారతజాతి తలపెట్టిన ఒక మహాప్రయత్నమనికూడా ప్రజలు గుర్తిస్తున్నారు.

ప్రజలు ప్రణాళికతో సాన్నిహిత్యం ఏర్పర్చుకోడానికీ, నవభారతనిర్మాణంలో తమ శక్తికొలది సహాయపడడానికీ, జాతీయ పొదుపు ఉద్యమం ఒక అవకాశాన్ని కలుగజేస్తున్నది. భారతదేశంలోని ప్రతిపౌరుడూ, అతనివృత్తి ఏదైనా సాంఘికంగా అతని అంతస్థు ఏమైనా అతడు ఈ మహాప్రయత్నంలో సరిసమానప్రతిపత్తిగల ఒకభాగస్వామి. అతడు ఏకొద్ది మొత్తం ఇచ్చినా అది మొత్తం జాతియొక్క సంకల్పాన్ని వ్యక్తీకరిస్తుంది.

జాతీయ పొదుపు ఉద్యమంలో స్త్రీల పొదుపు ఉద్యమం ఒక భాగం. ఇది మన స్త్రీలకు ఒక పిలుపువంటిది. సంసారంలో స్త్రీలు అతిముఖ్యమైనపాత్ర వహిస్తారు. పొదుపరితనంతో వారు కుటుంబాన్ని ఆర్థికంగా నిలబెట్టూవస్తారు. కాబట్టి పొదుపరితనానికి వారినే చెప్పుకోవాలి. అవి చిన్న మొత్తములే కావచ్చును. కాని జాతీయంగాచూస్తే వాటి ప్రాధాన్యం ఎక్కువ. ఒకపౌరుడు పొదుపుచేసి కొంత డబ్బు మిగుల్చుకోగలుగుతున్నాడంటే అతడు తన ఖర్చును కొంతవరకు తగ్గించుకొని మిగిలినదానిని జాతీయప్రణాళిక విజయవంతంగా అమలుజరగడానికి తోడ్పడుతున్నాడన్నమాట. జాతీయప్రణాళికఅంటే మరేమీకాదు. ఇది ప్రజల సాముదాయక సహకారపూర్వకమైన ప్రయత్నం. ఇది ప్రజలందరి శ్రేయస్సుకొరకై ఉద్దేశించబడింది.

### సలహాసంఘం

దేశవ్యాప్తంగా స్త్రీల పొదుపు ఉద్యమాన్ని వ్యాప్తం చెయ్యడానికి భారతప్రభుత్వం 1953 లో ఒక కేంద్రసలహాసంఘమును ఏర్పాటుచేసింది. కేంద్రసలహాసంఘంవారు ప్రథమ పంచవర్షప్రణాళిక క్రింద రూ. 8 కోట్లు వసూలు చేయాలని ఒక లక్ష్యం ఏర్పరచబడింది.

కేంద్ర సలహాసంఘ సభ్యులపేర్లు ఇవి :

1. శ్రీమతి హన్నా సెన్, కొత్తఢిల్లీ. అధ్యక్షురాలు
2. శ్రీమతి లక్ష్మీమజుందార్, కొత్తఢిల్లీ. ఉపాధ్యక్షురాలు (ఢిల్లీ, అస్సాం, పశ్చిమబెంగాల్, బీహార్ రాష్ట్రాలకు)
3. శ్రీమతి బేగంఅలీ జహీర్, లక్నో. సభ్యురాలు (ఉత్తరప్రదేశ్, పంజాబ్, కాశ్మీర్‌రాష్ట్రాలకు)
4. శ్రీమతి అచ్చమ్మ మత్తయి, బొంబాయి. ,, (మైసూరు, కేరళరాష్ట్రాలకు)
5. లేడీ రామారావు, బొంబాయి. ,, (బొంబాయి రాష్ట్రానికి)
6. శ్రీమతి జ్ఞానకుమారి హెడా, హైద్రాబాదు. ,, (ఒరిస్సా, మద్రాస్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు)
7. శ్రీమతి విమలా దేశ్‌ముఖ్, కొత్తఢిల్లీ. ,, (మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలకు)

1953 మార్చిలో దేశమంతటా స్త్రీల పొదుపుపక్షం జరపబడింది. ఆ పక్షంరోజులలో 50 లక్షల రూపాయలకు పైగా వసూలయ్యాయి.

హైద్రాబాదులో రాష్ట్రసహాయకమిటీ ఒకటి ఏర్పాటు చేయబడింది. ఆ కమిటీ సభ్యులు వీరు :

1. శ్రీమతి సంగెం లక్ష్మీబాయి.
2. శ్రీమతి బూర్గుల అనంతలక్ష్మీదేవి.
3. శ్రీమతి కనకరత్నమ్మ, మునిసిపల్ కౌన్సిలర్, వరంగల్.
4. శ్రీమతి ఆశాతాయ్ వాఘ్మారే, ఎం. ఎల్. ఏ. ఔరంగాబాదు.
5. శ్రీమతి మహాదేవమ్మ, రాయచూర్.
6. కుమారి అమీనా సఖ్వీ. ఆడ్వొకేటు, హైద్రాబాదు.
7. శ్రీమతి ఎల్లాప్రగడ సీతాకుమారి, హైద్రాబాదు.

1953-55 లో మాండలిక సలహాసంఘంయొక్క సమావేశాలు అనేకం జరిగినవి. స్త్రీలపొదుపు ఉద్యమం ప్రచారం చేయబడింది.

మొదటి ప్రచారసభ 1953 అక్టోబరు 7 వ తేదీన హైద్రాబాదులో జరిగింది.

1954 ఆగష్టు 16 వ తేదీనుంచి 30 వ తేదీవరకు మొదటి పొదుపుపక్షం జరపబడింది.

స్త్రీల పొదుపు ఉద్యమం కేంద్ర సలహాసంఘం అధ్యక్షురాలు శ్రీమతి హన్నాసెన్ 1955 జూన్ 30 వ తేదీన ఉద్యమానికి ప్రారంభోత్సవం చేసింది.

రెండవపక్ష కార్యక్రమం హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలోను, జిల్లాలలోను 1955 జులై 15 మొదలు 30 వ తేదీవరకు జరుపబడింది. మూడవపక్ష కార్యక్రమం 1956 సెప్టెంబరు 16 తేదీ మొదలు 30 తేదీ వరకు జరుపబడింది. రాష్ట్రంలోని వివిధ పార్కులలో మొత్తం 106 సభలు జరుపబడినవి.

హైద్రాబాదురాష్ట్ర ఇన్‌చార్జి, కేంద్రసలహాసంఘం సభ్యురాలు అగు శ్రీమతి జ్ఞానకుమారిహెడా రాష్ట్రం మొత్తంలో కొండజాతుల ప్రాంతాలతోసహా ఈ ఉద్యమాన్ని ప్రచారం చేసింది. కొండజాతులస్త్రీలు దేశపౌరులుగా తాము ఎంత ఇవ్వగలిగితే అంత మొత్తాలను పొదుపు ఉద్యమానికి ఇచ్చి దేశపునర్నిర్మాణ కార్యక్రమంలో భాగస్వాములు కావాలని ఆమె ప్రబోధించింది.

అఖిలభారత మహిళామహాసభ, అఖిలభారత మహిళల ఆహారసంఘం, భారత్ సేవక్ సమాజ్, ఆంధ్ర యువతీ మండలి, భారత సాంఘికసేవా మహాసభ మొదలగు సంఘసేవా సంస్థలు పొదుపు ఉద్యమానికి సహాయపడడానికి సంసిద్ధమయ్యాయి. వివిధ ఏజెంటుసంస్థలు వసూలుచేసిన మొత్తములు ఈ దిగువ చూపబడినవి :

| ఏజెంటు సంస్థపేరు | 1954 ఆగష్టు 1 వ తేదీనుంచి 1956 అక్టోబరు 31 వ తేదీవరకు వసూలు చేసిన మొత్తం రూ. |
|---|---|
| 1. సాంఘిక విద్యా పురోభివృద్ధికై ఏర్పడిన స్త్రీల సంఘం, (అఖిల భారత మహిళా మహాసభశాఖ) | 2,74,685 |
| 2. అఖిలభారత మహిళల ఆహారసంఘం. | 76,745 |
| 3. భారతసేవక్‌సమాజ్ ప్రదేశ్‌బోర్డు. | 1,17,655 |
| 4. భారతసేవక్ సమాజ్ ఆదిలాబాదు జిల్లాశాఖ. | 86,220 |
| 5. ఆంధ్ర యువతీ మండలి. | 3,33,740 |
| 6. భారత సాంఘికసేవా మహాసభ. | 25,328 |

రాష్ట్రంలోని దాదాపు మూడోవంతు ప్రాంతంలో ఏ ఏజంటుసంస్థకూడా పనిచేయలేదు. పైగా గతసంవత్సరం రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సందర్భంగా ఏర్పడినట్టి అనిశ్చిత పరిస్థితులవల్ల పొదుపు ఉద్యమం కార్యక్రమం కొంత వెనుకబడిపోయింది.

హైద్రాబాదురాష్ట్రంలో రూ. 41.92 లక్షలు వసూలు చేయవలెనని ఒక కోటా నిర్ణయించబడింది. కాని రూ. 12 లక్షలు మాత్రమే వసూలయ్యాయి. అయితే దీనివల్ల నిరుత్సాహపడవలసిన అవసరంలేదు. ఏ ఉద్యమంలో అయినా మొదట కొంచెం క్లిష్టపరిస్థితులలోనే పని జరుగవలసి వస్తుంది. స్త్రీలపొదుపు ఉద్యమం విషయంలోకూడా అంతే. స్త్రీలు ఈ ఉద్యమంలో ఉత్సాహంతో చొరవతీసుకొని పని చేయడానికి ఇంకా ఆర్థిక సాంఘికకారణాలు కొంత ప్రతిబంధకంగా వున్నాయి. అందువల్లనే ఉద్యమం అనుకున్నంత వేగంగా వ్యాప్తం కావడంలేదు. అంతేగాక ఈ ఉద్యమాన్ని మహిళాకార్యకర్తలే నిర్వహించవలసి వున్నది. వారు సంస్థలనిర్వహణ విషయంలోను, సామర్థ్యంవిషయంలోను శిక్షణ పొందవలసి వున్నది.

నూతన వ్యవస్థలో పరిస్థితి ఈవిధంగా ఉండబోదు. బహుశా కొంత మెరుగు కావచ్చు. ఇప్పుడిప్పుడే ప్రజలలో నవ్యోత్సాహం వెల్లివిరుస్తున్నది. ఆ ఉత్సాహాన్ని సక్రమ మార్గానపెట్టి దానిని ఇట్టి పొదుపు ఉద్యమంవంటి నిర్మాణ కార్యకలాపాలకు వినియోగించవలసి వున్నది.

## ఆంధ్ర జిల్లాలలో

ఆంధ్రరాష్ట్రమునకు ఇన్‌చార్జీ ప్రాంతీయసభ్యురాలుగా శ్రీ టి. జి. హైమవతిగారు పనిచేసినారు, వారి కృషి ఫలితంగా టాదాపు 21 ఏజంటు సంస్థలు ఏర్పడినవి. వీటిలో 48 మంది కార్యకర్తలు పనిచేస్తున్నారు. పొదుపు ఉద్యమాన్ని ప్రచారంచేసి దీనిని తీవ్రంగా వ్యాప్తం చేయడానికై ప్రతిసంవత్సరం పొదుపుపక్షం జరుపబడుతున్నది.

అనంతపూరులో జరిగిన రాయలసీమ కళలు, చేతిపరిశ్రమల ప్రదర్శనంలోను, విశాఖపట్నంలోజరిగిన ఎలక్ట్రికల్ ఇంజనీరింగు ఎగ్జిబిషన్‌లోను, రాజమంద్రి పుష్కరంలోను మహిళాకార్యకర్తలు పాల్గొన్నారు.

స్త్రీల పొదుపు ఉద్యమాన్ని వివరిస్తూ అడ్వర్టయిజింగ్ అండ్ విజువల్ పబ్లిసిటీ డైరెక్టరుచే ప్రచురింపబడిన ప్రత్యేక కరపత్రములు పోస్టర్లు ప్రజలకు పంచిపెట్టడానికై ఏజంటు కార్యకర్తలందరికీ పంపబడినవి. ముఖ్యమైన పట్టణాలలోని సినిమాలలో స్త్రీల పొదుపు ఉద్యమం స్లయిడ్లు చూపెట్టబడుతున్నవి. ఎన్నో కష్టాలు ఎదుర్కొనికూడా ఈ ఉద్యమం బాగా అభివృద్ధి జెందుతున్నదని ఈ క్రింది వసూళ్ళనుబట్టి తెలుస్తుంది.

| | | |
|---|---|---|
| మొదటి సంవత్సరం (1953-54) | రూ. | 24,685 |
| రెండవ సంవత్సరం (1954-55) | రూ. | 7,37,660 |
| మూడవ సంవత్సరం (1955-56) | రూ. | 11,66,092 |

ఇప్పుడు రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ఫలితంగా స్త్రీల పొదుపు ఉద్యమం విశాలప్రాతిపదికపై వ్యవస్థీకరించబడింది. కేంద్రసలహాసంఘం అట్లా వుండగా ప్రతిరాష్ట్రానికి వేరుగా ఒక సలహాసంఘం నియమించబడింది. ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రసలహాసంఘం ఈదిగువవిధంగా పునర్నిర్మాణం చేయబడింది.

1. లేడీ కుసుం త్రివేదీ, హైద్రాబాదు. అధ్యక్షురాలు
2. శ్రీమతి వై. శ్యామలాదేవి, ఆంధ్ర యువతీ మండలి హైద్రాబాదు. ఉపాధ్యక్షురాలు
3. శ్రీమతి టి. జి. హైమవతి, పవరుపేట, ఏలూరు. ,,
4. శ్రీమతి మునీర్ యస్ జూరీ, అఖిల భారత మహిళామహాసభ, హైద్రాబాదు. సభ్యురాలు
5. శ్రీమతి రత్నాబాయి, చిత్తూరు. ,,
6. శ్రీమతి జాన్, ఇండియన్ రెడ్‌క్రాస్, కర్నూలు. ,,
7. శ్రీమతి బుర్రా కమలాదేవి, మహారాణిపేట, విశాఖపట్నం. ,,

రెండవపంచవర్ష ప్రణాళిక క్రింద దేశం మొత్తంలో రూ. 25 కోట్లు వసూలు చేయబడవలెనని తలపెట్టబడింది. కనుక కొత్తగా ఏర్పడిన మనరాష్ట్రంలో ఈ ఉద్యమాన్ని తీవ్రతరం జేయవలసి వున్నది. భారతదేశంలోని ప్రతి కుటుంబం రోజుకు అదనంగా మరొక అణా మిగిలించినా నెలకు రూ. 13.5 కోట్లు, ఏడాదికి రూ. 162 కోట్లు చిన్న మొత్తముల పొదుపు పథకానికి లభిస్తాయి.

---

## భారతదేశమునకు క్రొత్త నాణెములు

[39 వ పేజీ తరువాయి]

సమానమయిన నాణెములను తెలుసుకోవాలంటే పైన ఉదాహరించబడినట్లుగా పట్టికను అనుసరించవలెను.

లావాదేవీలలో ప్రత్యక్షంగా నాణెములను ఇచ్చు సందర్భములోమాత్రమే యీ పట్టికను ఉపయోగించవలెను. ఇతర సందర్భములలో నాణెములు మార్చుకోవడం అవసరమైతే, అంటే నిర్ణీత రేటుప్రకారం కంప్యుటేషన్ అవసరమయితే రూపాయను భిన్నాంకములుగా చేయవలసివచ్చినప్పటికీ, రేటుకు కచ్చితంగా సమానమయిన విలువను లెక్కకట్టవలెను. ఆ తరువాత భిన్నాంకములను పట్టిక ప్రకారం నయా పైసాలలోకి మార్చవలెను.

### 3 వ పట్టిక

| నాణెముల విధములు | నయాపైసాలలో సరి సమానమైన దశాంశ విలువ | లావాదేవీలలో నాణెములు ప్రత్యక్షంగా ఇచ్చునపుడు నయా పైసాలలో మారకం విలువ |
|---|---|---|
| ఒక పైసా | 1.5626 నయాపైస | 2 నయాపైసలు |
| ½ అణా | 3.125 ,, | 3 ,, |
| 1 అణా | 6.25 ,, | 6 ,, |
| 2 అణాలు | 12.5 ,, | 12 ,, |

# వార్తలు - విశేషాలు

## ఆఫీసు వేళలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కార్యాలయాలు రోజూ ఉదయం 10-30 గం. ల నుంచి సాయంత్రం 5 గం. ల వరకు పని చేస్తాయి. మధ్యాహ్నం 1 గంట నుంచి 1-30 గం. వరకు భోజనమునకై విరామం ఉంటుంది.

## బోర్డు రద్దు

1952 సం. పు హైద్రాబాదు జాగీర్దార్ల ఋణ పరిష్కార చట్టం క్రింద ఏర్పరచబడిన బోర్డును ప్రభుత్వం అక్టోబరు 31 నుంచి రద్దుచేసింది. ఈ బోర్డు సమక్షంలో అపరిష్కృత మైన కేసులు రెవిన్యూ శాఖ ద్వారా స్థాపించబడిన మరొక బోర్డు ముందు పరిష్కరించబడుతాయి.

## రవాణా ఛార్జీలు

స్టేజి క్యారేజీలకు, ప్రభుత్వ బండ్లకు ప్రభుత్వం కనిష్ఠ, గరిష్ఠ ఛార్జీలు నిర్ణయించింది. ఈ ప్రకటన అధికార గజెటులో ప్రచురించబడిన తేదీ నుంచి అమల్లోకి వస్తుంది.

## పారిశ్రామిక వివాదాలు

పూర్వపు హైద్రాబాదు ప్రభుత్వ వ్యవసాయశాఖ యజమానులకూ, పనివారలకూ మధ్య ఏర్పడిన వివాదాన్ని తీర్పుకై ప్రభుత్వం పారిశ్రామిక న్యాయస్థానానికి నివేదించింది. వివాదాంశం ఇది : వ్యవసాయశాఖలో వివిధ వ్యవసాయ క్షేత్రములలో నియమింపబడిన కార్మికుల జీతాలలో వ్యత్యాసాన్ని తొలగించాలనీ, వ్యవసాయ క్షేత్రములలో పని చేయు కార్మికులకు సెలవు సౌకర్యాలు ఇవ్వాలనీ కార్మికులు కోరడం న్యాయసమ్మతమేనా ?

ఈ క్రింద పేర్కొనబడిన 7 పారిశ్రామిక సంస్థలకూ, వాటి కార్మికులకూ మధ్య ఏర్పడిన వివాదాలను తీర్పు నిమిత్తమై ప్రభుత్వం పారిశ్రామిక న్యాయస్థానానికి నివేదించింది.

సిర్పూరు పేపరు మిల్లు; సిర్సిల్కు లిమిటెడ్, సిర్పూరు కాగజ్ నగర్; ఆజంజాహీ మిల్లు, వరంగల్లు; హైద్రాబాదు వ్యవసాయ సహకార సంస్థ, హైద్రాబాదు కమర్షియల్, ఇండస్ట్రియల్ బ్యాంకు లిమిటెడ్, హైద్రాబాదు; నేషనల్ టొబాకో కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మంగళగిరి బ్రాంచి; ఫైర్ స్టోన్ టైర్ అండ్ రబ్బర్ కంపెనీ ఆఫ్ ఇండియా (ప్రైవేటు) లిమిటెడ్, విజయవాడ; తాజ్‌గ్లాస్ వర్క్సు లిమిటెడ్, హైద్రాబాదు.

## హెల్తు మ్యూజియం

1956 అక్టోబరు నెలలో పబ్లిక్ గార్డెన్సులోని హెల్తు మ్యూజియాన్ని సుమారు 39,060 మంది దర్శించారు.

## క్రమశిక్షణ విచారణకు న్యాయస్థానం

1950 సం. పు హైద్రాబాదు ప్రభుత్వోద్యోగుల (విచారణ న్యాయస్థానం) చట్టం క్రింద క్రమశిక్షణకు సంబంధించిన కేసులను విచారించగలందులకై ప్రభుత్వం న్యాయస్థానానికి అధికారమిచ్చింది.

## రిఫ్రెషర్ కోర్సు

నవంబరు 12 వ తేదీన నిలోఫర్ ఆసుపత్రిలో భారత ప్రభుత్వమూ, యునిసెఫ్ సంస్థ సంయుక్తంగా ఏర్పాటు చేసిన రిఫ్రెషర్ కోర్సుకు ప్రారంభోత్సవం జరుపబడింది. భారతదేశమంతటి నుంచి సుమారు 20 మంది నర్సులు ఒక నెల రోజుల వరకు యీ రిఫ్రెషర్ కోర్సులో పాల్గొన్నారు.

## నీటి పన్ను

1955 సం. పు ఆంధ్ర ఇర్రిగేషన్ వర్క్సు ( నిర్బంధ నీటి పన్ను విధింపు ) చట్టం క్రింద ప్రభుత్వం నీటి పన్ను నియమావళిని ప్రచురించింది.

## హెచ్. యస్. సి. పరీక్షలు

1957 మార్చిలో జరుగవలసిన హైయర్ సెకండరీ సర్టిఫికెటు టెక్నికల్ పరీక్షలను పూర్వపు హైద్రాబాదు రాష్ట్రం

లోని 17 జిల్లాలకు హైద్రాబాదు సెకండరీ ఎజుకేషన్ బోర్డు వారే యధాప్రకారం జరుపగలరు. ఆ పరీక్షలకు పాఠ్య ప్రణాళిక, పాఠ్య పుస్తకములు 1956-57 అకడమిక్ సంవత్సరం మాదిరిగానే ఉండగలవు.

## దేవాదాయములు

దేవాదాయ, ధర్మాదాయ ఆస్తులకు సంబంధించిన ట్రస్టీలు తమ బాధ్యత క్రింద గల ఆస్తులను అక్రమంగా అమ్మినా లేక కుదువబెట్టినా లేక మార్పిడి చేసినా వారిపై తీవ్రమైన చర్య గైకొనబడగలదని ప్రభుత్వం నవంబరు 19 వ తేదీన ఒక హెచ్చరిక చేసింది. అటువంటి అక్రమ లావా దేవీ లేవైనా జరిగినట్లయితే వాటిని ప్రజలు ప్రభుత్వ దృష్టికి తెస్తే తగుచర్య తీసుకోబడగలదు.

## "కాంద్ర" కులం

సంఘసంక్షేమశాఖవారు తయారుచేసే వెనుకబడిన తరగతులజాబితాలో శ్రీకాకుళంజిల్లా టెక్కలి తాలూకాలోని "కాంద్ర" కులమును చేర్చవలసిందిగా ప్రభుత్వం ఆదేశించింది. రంగారె, రంగరాజులు, దర్జీ, సింపీ కులములను వెనుకబడిన తరగతుల జాబితాలోని "భావసారక్షత్రియ కులము"తో సమానార్థకంగా పరిగణించవలెననికూడా ప్రభుత్వం ఆదేశించింది.

## రోడ్డు రవాణా

ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణాశాఖ అధిపతిని ఇకముందు నుంచి "రోడ్డు ట్రాన్స్‌పోర్టు సూపరింటెండెంట్" అని గాక "జనరల్ మేనేజరు, ఆంధ్రప్రదేశ్ రోడ్డు ట్రాన్స్‌పోర్టు" అని వ్యవహరించడమవుతుంది.

## మాజీ హైద్రాబాదు ప్రభుత్వోద్యోగులు

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ఫలితంగా బొంబాయి, మైసూరు రాష్ట్రాలకు కేటాయింపబడిన మాజీ హైద్రాబాదు ప్రభుత్వోద్యోగులు పోస్టింగ్ ఉత్తర్వులు అందినవెంటనే డ్యూటీలో చేరకపోయినట్లయితే వారు పనిలో చేరకుండా ఇష్టమొచ్చినట్లు తిరుగుతున్నవారుగా పరిగణింపబడుతారు. ఉద్యోగనియామకాలలో వాస్తవము తెలుసుకోకుండా నిర్ణయం జరిగిన సందర్భంలోను, భార్యనుంచి భర్తవిడిపోవడం, భర్తనుంచి భార్యవిడిపోవడం ఇంకా అటువంటి వాస్తవమైన కేసులసందర్భంలోనూ తప్ప లేకపోతే లోగడ ఇవ్వబడిన ఉత్తర్వులు పునః పరిశీలన చేయబడవు.

## పోలీసు దళం

కడపజిల్లా పులివెందల తాలూకాలోని కోమనూతల, తాటిరెడ్డిపల్లి గ్రామాలప్రాంతంలో నవంబరు 20 తేదీనుంచి మరిమూడు నెలలపాటు అదనపుపోలీసుదళం వుంచబడగలదని గవర్నరు ఒక ఉత్తర్వుచేశారు.

## వెనుకబడిన తరగతులు

అనంతపురం, కడప, కర్నూలుజిల్లాలలో కొద్దిసంఖ్యలో వుండే"పాత్రకులం"వారినీ, పెరికెబలిజ, "పురగిరిక్షత్రియ" కులములనూ సంఘసంక్షేమశాఖవారు తయారుచేసే వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్చవలసిందిగా ప్రభుత్వం ఆదేశించింది.

## ఆంధ్రప్రదేశ్ గెజెట్

ఆంధ్రప్రదేశ్ అధికారగెజెటు "ది ఆంధ్ర ప్రదేశ్ గెజెటు" అని వ్యవహరింపబడుతుంది. మరొకవిధంగా నోటిఫై చేయబడితే తప్ప లేకపోతే గెజెట్ సాధారణ సంచికలు ప్రతిగురువారం హైద్రాబాదునుంచి వెలువడగలవు. అవసరమైనప్పుడు అసాధారణ సంచికలు వెలువడగలవు.

## విద్యా సౌకర్యాలు

మద్రాసు, కర్నూలు, గుంటూరునుంచి హైద్రాబాదు వచ్చిన ఉద్యోగుల పిల్లల విద్యకొరకై సాధ్యమైనంతవరకు అన్ని సౌకర్యాలను కల్పించవలెనని ప్రభుత్వం ఆదేశించింది. అట్టి పిల్లలకు ఎట్టి అసౌకర్యం కలుగకుండా చూడవలసిందిగా ప్రభుత్వం పాఠశాలల అధిపతులకు ఉత్తర్వులిచ్చింది.

## కార్యాచరణ సంఘం

పౌర సమస్యలను పరిష్కరించు నిమిత్తం అన్ని మునిసిపాలిటీలలోనూ కార్యాచరణ సంఘాలు ఏర్పాటుచేయబడాలన్న విషయమై ఆంధ్రా మునిసిపల్ చైర్మనుల ఛేంబర్ కార్యదర్శి చేసిన కొన్ని సూచనలను ప్రభుత్వం ఆమోదించింది. మునిసిపల్ చైర్మన్, మునిసిపల్ కమీషనర్, ఆరోగ్యాధికారి, ఇంజనీరుతో కూడుకున్న కార్యాచరణ సంఘాలు అన్ని మునిసిపాలటీల లోనూ నెలకొల్పబడాలని మార్చి 15 వ తేదీన ఆంధ్ర ప్రభుత్వం ఆదేశించింది.

## చక్కెర పరిశ్రమ

పారిశ్రామిక వివాదముల చట్టం నిమిత్తమై పంచదార పరిశ్రమను 1956 నవంబరు 26 వ తేదీ నుంచి ఆరునెలల

వరకు ప్రజోపయోగకర సర్వీసుగా ప్రభుత్వము ప్రకటించింది.

## కందుల పంట

ఆంధ్ర రాష్ట్రం- పూర్వపు 11 జిల్లాలు- లో 1956-57 వ సంవత్సరంలో కందుల పంటకు సంబంధించిన మొదటి అంచనాను బట్టి 1956 ఆగస్టు ఆఖరు వరకు 135,000 ఎకరాలలో యీ పంట వేయబడినట్లు తెలుస్తున్నది. గత సంవత్సరం ఇదే కాలంలో 132,000 ఎకరాలలో యీపంట వేయబడినదనీ, అంతకు పూర్వం అయిదు సంవత్సరాలలో, యీ పంట వేయబడిన భూమి సగటు విస్తీర్ణం 132,900 ఎకరాలనీ, ప్రస్తుత భూమి విస్తీర్ణము గత సంవత్సరపు విస్తీర్ణం కంటె 2.3 శాతం ఎక్కువగా వుందనీ, గత ఐదు సంవత్సరాల సగటు విస్తీర్ణంకంటె 1.6 శాతం ఎక్కువగా వుందనీ అంచెనాలు తెలుపుతున్నవి.

## మోటారుబండ్ల నమోదు

రాష్ట్రంలో మోటారు బండ్ల నమోదు కొరకు 'ఏ పి' సీరీస్‌ను అవలంబించడానికి ప్రభుత్వం నిశ్చయించింది. పూర్వపు ఆంధ్ర హైద్రాబాదురాష్ట్రాలలో 'ఏ డి', 'హెచ్ వై' లేక 'హెచ్ టి'సీరీస్‌లు ఉపయోగించబడుతుండేవి. విస్తృత రాష్ట్రం ఏర్పడిన తరువాత కూడా వాటినే వాడడం అనుచితమని భావించబడింది.

## రాష్ట్ర చిహ్నం

ఆంధ్ర ప్రభుత్వ రాష్ట్ర చిహ్నన్నే, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర చిహ్నంగా కూడా ఉపయోగించడానికి ప్రభుత్వం ఆదేశించింది. అయితే ఆ చిహ్నంలో ' ఆంధ్ర ప్రభుత్వం ' అను ఇంగ్లీషు మాటలకు బదులు ' ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ' అనీ, ఆంధ్ర అని తెలుగు, దేవనాగరి లిపులలో గల దానికి మారుగా ఆంధ్ర ప్రదేశ్ అని వుండగలదు. ఇవి రాష్ట్ర చిహ్నం చుట్టూ ఒకే కేంద్రము గల రెండు వలయాలలోపల వుండగలవు.

## విమాన రవాణా పరిశ్రమ

పారిశ్రామిక వివాదముల చట్టమునను సరించి విమాన రవాణా పరిశ్రమ 1956 డిసెంబరు 2 వ తేదీనుంచి ఆరు నెలలవరకు రాష్ట్రంలో ప్రజోపయోగకర సర్వీసుగా ప్రకటింపబడింది.

## దుకాణముల చట్టం

మద్రాసు దుకాణముల, వ్యాపారసంస్థల చట్ట నిబంధనల నన్నింటినీ విశాఖపట్నం రేవు ప్రాంతంలో డిసెంబరు 15 వ తేదీనుంచి అమలు పర్చడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఆదేశించింది.

## ఆంధ్ర కౌలుదారీ చట్టం

పూర్వపు ఆంధ్రరాష్ట్ర జిల్లాలలోని తహశీల్దార్లు, 1956 వ సం.పు ఆంధ్రకౌలుదారీ చట్టనియమావళి జారీచేయబడ లేదన్న కారణంచే సదరుచట్టంక్రింద వారికి పెట్టుకోబడిన దరఖాస్తులను స్వీకరించడం లేదని ప్రభుత్వానికి విజ్ఞాపనలు చేయబడినవి. అట్టి నియమావళిని జారీచేసే విషయమై ప్రభుత్వం యోచిస్తున్నది. ఈలోగా ఈవిషయమై సదరు చట్టాన్ననుసరించి పెట్టుకోబడు దరఖాస్తులను స్వీకరించవలసిందిగా తహశీలుదార్లకు ఆదేశాలు ఇవ్వబడినవి.

## బియ్యం అమ్మకం

ధరలపెరుగుదలను అరికట్టి బియ్యంవాడకందార్లకు సహాయపడేతలంపుతో హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలో 111 చౌక ధరల దుకాణాలద్వారా మామూలురకం బియ్యం అమ్మడానికి ప్రభుత్వం ఏర్పాట్లుచేసింది. ఈ చౌక ధరల దుకాణాలలో ఒక్కొక్కరికి తడవకు రూ. 3 లకు మించకుండా బియ్యం అమ్మబడుతాయి.

## చెరకుధర

గజెట్ ప్రకటనలో వివరింపబడిన కొన్ని షరతులకు లోబడి 1956-57 సం. క్రషింగ్ సీజనులో తన ఫ్యాక్టరీ గేటువద్దకు తెచ్చి ఇవ్వబడినచెరకుగడకు చక్కెర ఉత్పత్తిదారు మణుగు 1 కి కనీసం 1-7-0 లను రైల్వేసెంటర్‌లో అందజేయబడిన చెరకు గడకు మణుగు 1 కి కనీసం రూ. 1-5-0 లను చెల్లించవలెనని యూనియన్ ప్రభుత్వం ఆదేశించింది.

# దేశంతో పాటు మీరు కూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును
## భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకంలో
## పెట్టుబడి పెట్టండి!

భారత దేశం యొక్క
సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు,
రైలుమార్గములు రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

*మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| 12 సంవత్సరముల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు | మెచ్యూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 4.16 వంతుల చొప్పున వడ్డీ లభిస్తుంది. రూ. 5 లవి మొదలు రూ. 5,000 ల వాటివరకు ఈ సర్టిఫికెట్లు లభించును. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| 10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు | ప్రతియేటా నూటికి 3½ వంతుల చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి వరకు లభిస్తాయి. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| 10 సంవత్సరముల జాతీయ ప్రణాళిక సర్టిఫికెట్లు | మెచ్యూరిటీ పొందిన మీదట నూటికి ఏడాదికి 4½ వంతుల చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. 5 రూ. లవి, 10 రూ. లవి, 25 రూ. లవి, 50 రూ. లవి, 100 రూ. లవి, 500 రూ. లవి ఇవ్వబడును. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ చేర్చబడుతుంది. శేషముపై రూ. 15,000 ల వరకు నూటికి 1½ వంతుల చొప్పున వడ్డీ చేర్చబడుతుంది. |
| 5 సంవత్సరముల అన్యూటీ సర్టిఫికెట్లు | నూటికి ఏడాదికి 3½ వంతుల చక్రవడ్డీతో నెలసరి కిస్తులుగా 15 ఏండ్ల లోపున తిరిగి చెల్లించబడుతాయి. జారీచేయబడు ధరలు : రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000 రూ. 28,000 వ్యక్తిగతంగా రూ. 28,000 ల వరకు కొనవచ్చును. |

## *ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!*
## *భారతదేశ ఉజ్జ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!*

ఇతర వివరములకు, ఈ పెట్టుబళ్ళకు సంబంధించిన నియమావళికొరకు :
**నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా చిరునామాకుగాని లేక**
**రీజనల్ ఆఫీసరు, హైద్రాబాదు (దక్కన్)**
చిరునామాకుగాని వ్రాయవలెను.

